Islam Sandesham- Niyama Nibhandanallu
(Telugu)

# ఇస్లాం సందేశం నియమ నిబంధనలు

రచన
ముహమ్మద్ ఫారూఖ్ ఖాన్, యం.ఏ.

అనువాదం
ముహమ్మద్ గౌస్ ఖాన్

# విషయసూచిక

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# ఇస్లాం సందేశం నియమ నిబంధనలు

సందేశదాత తన సందేశంలో ఇస్లామీయ సందేశ నియమాలు, పద్ధతులను ఉపయోగించాలి. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ముహమ్మద్ (సఅసం) మనిషి జీవితంలోని అనేక సమస్యలకు పరిష్కార మార్గం చూపినట్లే, ఈ విషయం గురించి కూడా పరిష్కార మార్గాలు చూపినట్లు దివ్యఖుర్ఆన్ మరియు ప్రవక్త (సఅసం)గారి ప్రవచనాలను అధ్యయనం చేయడం వల్ల మనకు స్పష్టంగా తెలుస్తుంది. దీనికి సంబంధించిన కొన్ని విషయాలు మీ ముందు ఉంచడానికి ప్రయత్నం చేస్తాను. ఇస్లామీయ సందేశ నియమాలు, పద్ధతుల విషయంలో దివ్యఖుర్ఆన్ సంపూర్ణమైన ఉపదేశాలను ఇస్తుంది.

ادْعُ إِلَىٰ سَبِيلِ رَبِّكَ بِالْحِكْمَةِ وَالْمَوْعِظَةِ الْحَسَنَةِ وَجَادِلْهُم بِالَّتِي هِيَ أَحْسَنُ إِنَّ رَبَّكَ هُوَ أَعْلَمُ بِمَن ضَلَّ عَن سَبِيلِهِ وَهُوَ أَعْلَمُ بِالْمُهْتَدِينَ

ప్రవక్తా! నీ ప్రభువు మార్గం వైపునకు ఆహ్వానించు. వివేకంతో చక్కని హిత బోధతో, ప్రజలతో ఉత్తమోత్తమ మైన రీతిలో వాదించు. నీ ప్రభువుకే బాగా తెలుసు, ఆయన మార్గం నుండి తప్పి పోయినవాడు ఎవడో, రుజుమార్గంలో ఉన్నవాడు ఎవడో. (అన్నహ్ల్:125)

సందేశాన్ని ఒకవైపు వివేకవిజ్ఞతలతో, మరోవైపు మంచి నేర్పుతో ఇవ్వాలని దీనిద్వారా తెలుస్తుంది. అలా చెయ్యడం సందేశకుడి విధి. అసత్యాన్ని అసత్యపరచడానికి, వాస్తవాన్ని ధృవపరచడానికి సరియైన నిదర్శనాలను ఉపయోగించాలి. అసత్యవాదుల వద్ద మాయోపాయాలు, అజ్ఞానం తప్ప మరేమీ లేవని నిరూపించాలి. ఈ పనిని ఎంతో జాగ్రత్తగా పూర్తి చెయ్యాలి.

ఇందులో ఏ కొద్దిపాటి అలసత్వం వహించినా, సందేశమంతా వ్యర్థమై పోతుంది, అసత్యాన్ని అణచివేయదలిచినప్పుడు, విరోధి మనసు గాయపడ కుండా జాగ్రత్తపడాలి. తాను అనుసరిస్తున్న మార్గం సరైంది కాదని అతను గ్రహించ గలగాలి.

అంతేకాదు, అతనికి యదార్థం పట్ల ఆసక్తి, ఆకర్షణ కలగాలి. అసత్యా నికి ఒక పునాదంటూ ఏమీ ఉండదు. అందువల్ల అసత్యవాదులు తమ వాదనలో స్థిరమైన వైఖరిని అవలంబించలేరు. వారి బలహీనత ఏమిటంటే, వారు మాయోపాయంతో మాత్రమే ఇతరులను తమ వైపు ఆకర్షించే ప్రయత్నం చేస్తారు.

ఇస్లాం సందేశం కోసం దివ్యఖుర్ఆన్ ఏ మార్గదర్శకాలనయితే సూచించిందో, అందులో మనసును మేధను సంతృప్తి పరచగల వాస్తవమైన విద్యావిజ్ఞానాలే కాక, సభ్యతా సంస్కారం, బుద్ధికుశలత ఇంకా ఉత్తమోత్తమ కార్యచరణ విధానాలు కూడా అందులో ఉన్నాయి.

సత్యసందేశ ప్రచారంలో మనం ఎంతగా సఫలీకృతం అవుతామో, అది అంతే ఎక్కువ మందిని ఆకర్షించడానికి కారణమవుతుంది. కాబట్టి ఈ యదార్థాన్ని ఎంతో హుందాగా ఉన్నతంగా తెలుపవలసిన అవసరం ఉంది. దాని వ్యక్తీకరణ విధానంలో నిజాయితీ, సూటిదనం ఉన్నట్లయితే అదే మనిషి గుండె చప్పుడు అవుతుంది. దీని కోసమే ప్రకృతి ఆది నుండీ ఆరాటపడు తోంది. ఇస్లాం సందేశసారాన్ని దివ్యఖుర్ఆన్ అనేక విధాలుగా తెలియజేసింది. దీనివల్ల ఒకవైపు సందేశానికి సంబంధించిన అనేక అంశాలు మన ముందుకు రాగా, రెండవ వైపు ఈ సత్యసందేశం మానవుని హృదయాంతరాళాల భావోద్రే కాలను ప్రతిబింబిస్తుంది. ఫలితంగా ఈ సందేశాన్ని స్వీకరించమని అతని నైజం ప్రోద్బలం చేస్తున్నట్లు, ఒత్తిడి చేస్తున్నట్లు అతడు గ్రహిస్తాడు. ఇక్కడ దివ్యఖుర్ఆన్ కొన్ని ఉదాహరణలు మీ ముందుంచబడుతున్నాయి. దీనివల్ల దివ్యఖుర్ఆన్ ఇస్లాం సందేశాన్ని ఏ విధంగా వివిధ శీర్షికల్లో తెలియ జేస్తుందో

మనకు తెలుస్తుంది. దీనిలోని ప్రతి అంశమూ మానవుణ్ణి తన వైపు చక్కగా ఆకర్షిస్తుంది.

## దైవసందేశం

దివ్యఖుర్‌ఆన్ తన సందేశాన్ని దైవసందేశం అంటుంది. దివ్య ఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

قُلْ هٰذِهٖ سَبِيْلِيْٓ اَدْعُوْٓا اِلَى اللّٰهِ ۚ
عَلٰى بَصِيْرَةٍ اَنَا وَمَنِ اتَّبَعَنِيْ ۖ وَ
سُبْحٰنَ اللّٰهِ وَمَآ اَنَا مِنَ الْمُشْرِكِيْنَ

నీవు వారికి స్పష్టంగా ఇలా తెలియ జెయ్యి: "నా మార్గం ఇది- నేను అల్లాహ్ వైపునకు పిలుస్తాను. స్వయంగా నేను కూడా నిండువెలుగులో నా మార్గాన్ని చూస్తున్నాను. నా సహచరులు కూడా చూస్తున్నారు. అల్లాహ్ పరిశుద్ధుడు, షిర్క్ చేసేవారితో నాకు ఏ సంబంధమూ లేదు." (యూసుఫ్-108)

మరోచోట ఇలా తెలియజేయబడింది:

قُلْ اِنَّمَآ اُمِرْتُ اَنْ اَعْبُدَ اللّٰهَ
وَلَآ اُشْرِكَ بِهٖ ۚ اِلَيْهِ اَدْعُوْا وَ
اِلَيْهِ مَاٰبِ-

నీవు స్పష్టంగా ఇలా అను: "అల్లాహ్‌ను మాత్రమే ఆరాధించు అని నాకు ఆజ్ఞాపించబడింది. ఇతరులను ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టకు అని నాకు నిషేధించబడింది. కనుక నేను మిమ్మల్ని ఆయన వైపునకే ఆహ్వానిస్తున్నాను. ఆయన వైపునకే నేను మరలుతాను." (అర్రాద్:36)

ప్రవక్త ముహమ్మద్ (సఅసం) గారిని ఉద్దేశించి ఇలా తెలియజేయబడింది:

ఓ ప్రవక్తా! మేము నిన్ను సాక్షిగా చేసి, శుభవార్తను ఇచ్చేవానిగా, హెచ్చరిక చేసేవానిగా చేసి అల్లాహ్ అనుమతితో ఆయన వైపునకు పిలుపు ఇచ్చేవానిగా చేసి, ప్రకాశించే దీవంగా చేసి పంపాము." (అల్ అహ్‌జాబ్-45,46)

يَآأَيُّهَا النَّبِيُّ إِنَّا أَرْسَلْنٰكَ شَاهِدًا
وَّمُبَشِّرًا وَّنَذِيْرًا ۙ وَّدَاعِيًا
إِلَى اللّٰهِ بِإِذْنِهٖ وَسِرَاجًا مُّنِيْرًا ۔

ఒకచోట ఇలా తెలియజేయబడింది:

నీవు నీ ప్రభువు వైపునకు పిలువు. నిశ్చయంగా నీవు ఋజుమార్గంలో ఉన్నావు. (అల్ హజ్:67)

وَادْعُ إِلٰى رَبِّكَ ۖ إِنَّكَ لَعَلٰى
هُدًى مُّسْتَقِيْمٍ

మరోచోట ఇలా ఆజ్ఞాపించబడింది:

అల్లాహ్ వాక్యాలు నీపై అవతరించి నప్పుడు, అవిశ్వాసులు నిన్ను వాటి నుండి వైదొలగించడం అనేది ఎన్నటికీ జరగకూడదు. నీ ప్రభువు వైపునకు ఆహ్వానించు. బహుదైవారాధకులలో ఎంతమాత్రం చేరిపోకు.
(అల్‌ఖసస్:87)

وَلَا يَصُدُّنَّكَ عَنْ اٰيٰتِ اللّٰهِ
بَعْدَ إِذْ أُنْزِلَتْ إِلَيْكَ وَادْعُ
إِلٰى رَبِّكَ وَلَا تَكُوْنَنَّ مِنَ
الْمُشْرِكِيْنَ

ఒకచోట ఇలా సెలవియ్యబడింది:

అల్లాహ్ వైపునకు పిలిచి మంచి పనులు చేసి, నేను ముస్లింను అని ప్రకటించే వ్యక్తి మాటకంటే మంచి మాట మరెవరిది కాగలదు.
(హామీమ్ అస్‌సజ్‌దహ్:33)

وَمَنْ أَحْسَنُ قَوْلًا مِّمَّنْ
دَعَا إِلَى اللّٰهِ وَعَمِلَ صَالِحًا وَّقَالَ
إِنَّنِيْ مِنَ الْمُسْلِمِيْنَ

అల్లాహ్ వైపు పిలుపుకంటే మంచి పిలుపు ఇంకేది కాగలదు. మిగిలిన పిలుపులన్నీ ఆ పిలుపు ముందు పనికిరానివే కాకుండా, అనేక రకాల చెడులకు కారణమవుతాయి. దేశీయత వైపు పిలుపైనా, జాతీయత వైపైనా, ఏదయినా వంశం, వర్ణం, వర్గం లేక కార్మికులు, పెట్టుబడీదారి వర్గాలను ఉద్దేశించైనా ఏదయినా సరే. ఈ విధమైన సందేశం ద్వారా మానవులందరినీ ఏకం చేయడం సాధ్యం కాదు. కేవలం పరిమిత లక్ష్యాల కోసం మనుషులంతా అనేక జాతులుగా, సంఘాలు గ్రూపులుగా విడిపోయి, ఆ స్వల్ప ఉద్దేశాల కోసం అత్యుత పడినట్లయితే దాని పర్యవసానం పరస్పర ద్వేష జగడాలు, యుద్ధ రక్తపాతాలను చవిచూడవలసి వస్తుంది. ఇది మనకు తెలియని విషయమేమీ కాదు.

దైవాన్ని తెలుసుకోవాలన్న కోరిక, అభిలాష ప్రతి వ్యక్తిలో ఉంటుంది. అది మానవుడి సహజ నైజం కూడా! మనిషి ఆయన (అల్లాహ్) పైనే విశ్వాసం ఉంచగలడు. మనిషికి శాశ్వతమైన అనుగ్రహం కలిగించే శక్తి ఆయనకే ఉంది. ఆవేశంలో తెలిసీతెలియక చేసిన తప్పిదాలకు ఆశ్రయం ఆయనే. ఆయనతో పటిష్ట సంబంధం ద్వారానే ఆత్మసంతృప్తి, మానసిక ప్రశాంతత ప్రాప్తిస్తుంది. మనిషికి నిజమైన మార్గదర్శి ఆయనే. ఎవరి హక్కులకు ఎలాంటి భంగం వాటిల్లని సవ్యమైన, న్యాయబద్ధమైన జీవనవిధానాన్ని ఆయన మాత్రమే ప్రసాదించగలడు.

ఇస్లామీయ సందేశం వాస్తవానికి అల్లాహ్ వైపు పిలుపునిస్తుంది. ఈ సందేశాన్ని, నిజవాస్తవాన్ని కాదనే నాస్తికుడి ముందుకు చెడ్డ పరిణామం వచ్చిపడినప్పుడు అతను ఇలా అంటాడు:

"అల్లాహ్ విషయంలో నేను చూపిన నిర్లక్ష్యతకు నేను ఎంతో చింతిస్తున్నాను. పైగా నేను ఎగతాళి చేసే వారిలో చేరిపోయాను."

(అజ్ జుమర్:56)

يَٰحَسْرَتَىٰ عَلَىٰ مَا فَرَّطتُ فِى جَنۢبِ ٱللَّهِ وَإِن كُنتُ لَمِنَ ٱلسَّٰخِرِينَ - (الزمر: ٥٦)

## జీవన సందేశం

అల్లాహ్ వైపు సందేశం వాస్తవానికి జీవన సందేశమే. జీవించాలన్న కోరిక, అభిలాష ప్రతి వ్యక్తిలో ఉంటుంది. బుద్ధీజ్ఞానాల సంబంధం జీవించడమైతే, అజ్ఞాన మూఢత్వాల సంబంధం మృత్యువు, మనిషి యదార్థాన్ని ఎంత గట్టిగా ప్రేమిస్తాడో, అతను తన జీవితంలో అంతే మాధుర్యాన్ని పొందగలుగుతాడు. అధైర్య పిరికితనాలు అతనిదరికి చేరవు. అలాంటి వారికే ఉన్నతస్థానం లభిస్తుంది. వారి శక్తిసామర్థ్యాలను భంగ పరచడం అసాధ్యమవుతుంది. ఇప్పుడు చెప్పండి- ఇలాంటి జీవితాన్ని ఇష్టపడని వారెవరుంటారు? ఇలాంటి జీవితాన్ని ఎవరు కాదంటారు? అయితే, మనిషి అజ్ఞాన మూర్ఖత్వాల వల్ల అధైర్య పిరికితనాలను ఉన్నతం గాను, మృత్యువును ఆయువుగాను ఇంకా దారిద్ర్యాన్ని ధనికంగా భావిస్తు న్నాడు. మృత్యు చీకట్ల నుండి బయటపడి జీవనం వైపు నడవమని దివ్యఖుర్ఆన్ సందేశమిస్తుంది.

విశ్వసించిన ప్రజలారా! అల్లాహ్ పిలుపునకూ, ఆయన ప్రవక్త పిలుపునకూ జవాబు పలకండి, ప్రవక్త మీకు జీవితాన్ని ప్రసాదించే దాని వైపునకు మిమ్మల్ని పిలిచినప్పుడు.

(అన్ఫాల్:24)

يٰٓاَيُّهَا الَّذِيْنَ اٰمَنُوا اسْتَجِيْبُوْا لِلّٰهِ وَلِلرَّسُوْلِ اِذَا دَعَاكُمْ لِمَا يُحْيِيْكُمْ -

ఇలాంటి జీవితం విశ్వసించిన వారికి మాత్రమే లభిస్తుంది. వారి ప్రవర్తన, అలవాట్లు వారి విశ్వాసానికి అద్దంపడతాయి.

పురుషుడైనా స్త్రీ అయినా సత్కర్మలు చేస్తే, విశ్వాసి అయిన పక్షంలో మేము అతనికి ప్రపంచంలో పరిశుద్ధ జీవితం గడిపేలా చేస్తాము. (అన్ నహ్ల్:97)

مَنْ عَمِلَ صَالِحًا مِّنْ ذَكَرٍ اَوْ اُنْثٰى وَهُوَ مُؤْمِنٌ فَلَنُحْيِيَنَّهٗ حَيٰوةً طَيِّبَةً -

దివ్యఖుర్‌ఆన్‌ను స్వీకరించిన వారికి ఇలాంటి జీవితం లభిస్తుంది. వారికి అల్లాహ్ విద్య, దూరదృష్టి మరియు ధర్మశాస్త్ర వెలుగును ప్రసాదిస్తాడు. ఈ వెలుగులో అతను జీవిస్తాడు. అతని జీవితంలోని ఏ రంగంలో కూడా చీకటి కానరాదు. ధార్మిక విషయాల నుండి జీవితపు సర్వసాధారణ విషయాల వరకు అతని జీవితంలో ఎలాంటి విరుద్ధత ఉండదు. ఈ వాస్తవాన్ని దివ్యఖుర్‌ఆన్ ఇలా తెలియజేస్తుంది.

أَوَمَنْ كَانَ مَيْتًا فَأَحْيَيْنَاهُ وَ
جَعَلْنَا لَهُ نُورًا يَمْشِي بِهِ
فِي النَّاسِ كَمَنْ مَثَلُهُ فِي الظُّلُمٰتِ
لَيْسَ بِخَارِجٍ مِّنْهَا۔

మొదట మృతుడై, మేము ప్రాణం పోసి జ్యోతిని ప్రసాదించగా, దాని వెలుగులో ప్రజల మధ్య జీవనయాత్ర కొనసాగించే వ్యక్తీ, చీకట్లలో కూరుకుపోయి వాటి నుండి ఏ విధంగానూ బయటకురా లేని వ్యక్తీ ఒక్కటే అవుతారా?
(అల్ అన్ఆమ్:122)

## మార్గదర్శపు సందేశం

దివ్యఖుర్‌ఆన్ తన సందేశాన్ని మార్గదర్శపు సందేశం అని కూడా అంటోంది. అన్ని ధర్మాలపై ఆధిక్యతను ప్రసాదించడానికి అల్లాహ్ తన ప్రవక్తలను మార్గదర్శకులుగా నిజధర్మంతో పంపించడానికి దివ్యఖుర్‌ఆన్ తెలియజేస్తుంది:

هُوَ الَّذِي أَرْسَلَ رَسُولَهُ
بِالْهُدٰى وَدِيْنِ الْحَقِّ لِيُظْهِرَهُ
عَلَى الدِّيْنِ كُلِّهٖ

అల్లాహ్‌యే తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్ని, సత్యధర్మాన్ని ఇచ్చి పంపించాడు, అది అన్ని ధర్మాలపై ఆధిక్యం కలిగి ఉండేలా చేయడానికి.
(అల్ ఫతహ్-28, అస్సఫ్-9)

దివ్యఖుర్‌ఆన్ దృష్టిలో- ఎవరికయితే అల్లాహ్ ఆయత్‌ల ద్వారా ఉపదేశం అంది కూడా, వాటిని త్రోసిపుచ్చి తన చేజేతులారా చేసుకున్న

చెడు కర్మల ప్రతిఫలాన్ని చవిచూడగలడో, అతనికంటే పెద్ద దుర్మార్గుడు ఇంకెవడు కాగలడు? నిజానికి ఇలాంటి వ్యక్తుల హృదయాలు ముసుగుతో కప్పబడి ఉంటాయి. అవి దివ్యఖుర్‌ఆన్ ఆయత్‌లను అర్థం చేసుకోనియ్యవు. వారి చెవులు కూడా భారమైపోతాయి. వారు విని కూడా ఏమీ వినలేరు. ఇలాంటి వారి గురించి దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా తెలియజేయబడింది.

وَاِنْ تَدْعُهُمْ اِلَى الْهُدٰى فَلَنْ يَّهْتَدُوْٓا اِذًا اَبَدًا۔

నీవు వారిని సన్మార్గం వైపునకు ఎంత పిలిచినా, వారు ఈ స్థితిలో ఎన్నటికీ సన్మార్గాన్ని పొందలేరు.

(అల్ కహఫ్:57)

మార్గదర్శకత్వం లేకుండా ఏ వ్యక్తీ నిజ జీవిత గమ్యాన్ని చేరలేడు. అతని విజయసాఫల్యాలన్నీ మార్గదర్శకంతోనే ముడివడి ఉన్నాయి. మనిషి మార్గదర్శకత్వాన్ని విడనాడినట్లయితే అతనికి అంధకారం తప్ప మరేమీ మిగలదు. వీటిని స్వీకరించడమంటే వినాశనం తప్ప మరేమీ కాదు. చెడు మార్గాన్ని అవలంబించిన ఏ వ్యక్తీ ఇంత వరకు నిజగమ్యాన్ని చేరలేదు ఇక ముందు చేరనూ లేడు.

దివ్యఖుర్‌ఆన్ ఏ మార్గదర్శక సందేశాన్ని ఇస్తుందో, దాని సంబంధం మనిషి ఆలోచనాసరళితోపాటు, అతని వ్యక్తిగత, సామూహిక జీవితంతో కూడా ముడిపడి ఉంది. కనుక మార్గదర్శకత్వాన్ని వీడటమంటే తనను తాను చెడు మార్గంలో పడవేసుకోవడమే అవుతుంది. మనిషికి ఏదయినా రుజుమార్గం ఉందంటే, అది కేవలం అల్లాహ్ చూపిన రుజు మార్గమే. మనిషి నైజం అవసరాలను తెలిసినవాడు అల్లాహ్‌యే. ఆయన కంటే ఎక్కువగా కరుణించే వాడు, దయార్ద్రుడు ఇంకెవడు కాగలడు. అందువల్ల దివ్యఖుర్‌ఆన్ తన సందేశాన్ని దేవుని రుజుమార్గపు సందేశంగా పేర్కొంది.

## రుజుమార్గపు సందేశం

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) గురించి ఇలా తెలుపబడింది:

وَاِنَّكَ لَتَدۡعُوۡهُمۡ اِلٰى صِرَاطٍ مُّسۡتَقِيۡمٍ

నీవు వారిని రుజుమార్గం వైపునకు పిలుసున్నావు.

(అల్ మూమినూన్:73)

నిజానికి దైవదాస్యపు మార్గం ఇదే. దైవదాస్య మార్గాన్ని వీడి, మరే మార్గాన్ని అవలంబించినా, అది మానవ నైజానికి వ్యతిరేకం కావడమే కాకుండా అతని వినాశనానికి కూడా కారణమవుతుంది. మనిషి తన జీవితపు ఉనికిని కోల్పోతాడు. రాబోవు శుభాలు కూడా అంతమైపోతాయి. కేవలం దైవదాస్యపు మార్గమే రుజుమార్గం అవుతుంది.

దివ్యఖుర్ఆన్‌లో ఇలా తెలుపబడింది:

اِنَّ اللّٰهَ رَبِّىۡ وَرَبُّكُمۡ فَاعۡبُدُوۡهُ‌ ؕ هٰذَا صِرَاطٌ مُّسۡتَقِيۡمٌ

"అల్లాహ్ నాకూ ప్రభువే, మీకూ ప్రభువే. కనుక మీరు ఆయన దాస్యాన్నే చెయ్యండి. ఇదే రుజుమార్గం."

(ఆలి ఇమ్రాన్:51)

## అల్లాహ్‌పై విశ్వాసపు సందేశం

దివ్యఖుర్ఆన్ అల్లాహ్‌పై విశ్వాసపు సందేశాన్ని కూడా ఇస్తుంది.

وَمَا لَـكُمۡ لَا تُؤۡمِنُوۡنَ بِاللّٰهِ‌ۚ وَالرَّسُوۡلُ يَدۡعُوۡكُمۡ لِتُؤۡمِنُوۡا بِرَبِّكُمۡ

మీకు ఏమయింది, అల్లాహ్‌ను మీరు విశ్వసించరు? వాస్తవానికి ప్రవక్త, మీ ప్రభువును విశ్వసించండని మీకు పిలుపునిస్తున్నాడు. (అల్ హదీద్:8)

బుద్ధిజ్ఞానాలు గలిగినవారు, సర్వసృష్టి గురించి ఆలోచించే చింతగల వారు ఇలా అంటారు:

رَبَّنَاۤ اِنَّنَا سَمِعۡنَا مُنَادِيًا يُّنَادِىۡ لِلۡاِيۡمَانِ اَنۡ اٰمِنُوۡا بِرَبِّكُمۡ فَاٰمَنَّا ‌

(آل عمران

ప్రభూ! మేము విశ్వాసం వైపునకు పిలిచేవాని పిలుపును విన్నాము. మీ ప్రభువును విశ్వసించండి అని అతను

అనేవాడు. మేము అతని సందేశాన్ని స్వీకరించాము. (ఆలి ఇమ్రాన్:193)

విశ్వాసం, నమ్మకము లేకుండా ఇస్లాం లేదు. దైవదాస్యమూ లేదు. విశ్వాసం లేకుండా అల్లాహ్ తెలిపిన మార్గంలో ఒక్క అడుగు కూడా ముందుకు వెళ్ళలేము. విశ్వాసం కేవలం హృదయంలోనేకాక, నిజ జీవితం లోని ప్రతిరంగంలో కూడా సంపూర్ణంగా ఉట్టిపడాలి. విశ్వాసి జీవితంలో ఏ ఒక్క అంశం, కోణము కూడా అతని విశ్వాసానికి వ్యతిరేకంగా ఉండదు.

## ఇస్లాం వైపు సందేశం

దివ్యఖుర్ఆన్ ఇస్లాం సందేశాన్ని కూడా ఇస్తుంది. ఎవరికైనా ఇస్లాం సందేశం అంది కూడా అసత్య, నిందారోపణకు పూనుకుంటే, అతనికంటే పెద్ద దుర్మార్గుడు మరెవరూ ఉండరు.

وَمَنْ أَظْلَمُ مِمَّنِ افْتَرَىٰ عَلَى اللَّهِ الْكَذِبَ وَهُوَ يُدْعَىٰ إِلَى الْإِسْلَامِ ۚ وَاللَّهُ لَا يَهْدِي الْقَوْمَ الظَّالِمِينَ -

ఇక ఇస్లామ్ (అల్లాహ్‌కు తనను తాను సమర్పించుకోవడం) సందేశం అంద జేయబడుతున్నప్పటికీ, అల్లాహ్‌పై అపనిందలు మోపేవాడి కంటే పరమ దుర్మార్గుడెవడు? అటువంటి దుర్మార్గులకు అల్లాహ్ సన్మార్గం చూపడు. (అస్సఫ్:7)

అంటే అతనికి ఏదోవైపు కాకుండా అల్లాహ్ వైపు, పరుల దాస్యం బదులు అల్లాహ్ దాస్యం వైపు పిలవడం జరుగుతుంది. ఎందుకంటే, ఇందులో అతనికి అన్ని విధాలా ప్రయోజనమే ఉంది. అయినా అతను పెడ ముఖం చూపిస్తే, అలాంటి వ్యక్తిని నిస్సందేహంగా దుర్మార్గుడు అని చెప్పవచ్చు.

## మంచివైపు సందేశం

దివ్యఖుర్ఆన్ మంచివైపు కూడా సందేశాన్ని ఇస్తుంది. ప్రతి మనిషీ మంచినే కోరుకుంటాడు. ఈ విషయాన్ని దృష్టిలో ఉంచుకొని అతనికి ఇచ్చే

సందేశమే మంచివైపుకు సందేశం. అల్లాహ్ సందేశాన్ని స్వీకరించి, దివ్య ఖుర్ఆన్ చూపిన మార్గదర్శకంలో జీవించడంలోనే మనిషి యోగక్షేమాలు ఆధారపడి ఉన్నాయి. విశ్వసించిన వారు సర్వమానవులను మంచివైపుకు ఆహ్వానించామని దివ్యఖుర్ఆన్ కోరుతుంది.

وَلْتَكُن مِّنكُمْ أُمَّةٌ يَدْعُونَ إِلَى الْخَيْرِ

మీలో మంచివైపునకు పిలిచేవారూ, మేలు చెయ్యండి అని ఆజ్ఞాపించే వారూ కొందరు తప్పకుండా ఉండాలి.
(ఆలి ఇమ్రాన్:104)

మనిషి కోరికలు మరియు ఆశలు ఇహలోకంలో నెరవేరలేవు. మనసులో కలిగిన కోరికలు, కోరుకున్న అనుగ్రహాలను శాశ్వతంగా పొందాలను కోవడం మనిషి స్వభావం. ఉదాహరణకు- ఎల్లప్పుడూ యవ్వనం మరియు ఆయురారోగ్యాలు, బాధ, ఆపద విపత్తుల నుండి విమోచనం. ఈ కోరికలన్నీ ఏదో ఒక సందర్భంలో నెరవేరాలని, వీటిని పుట్టించడం జరిగింది. ఈ కోరికలు, ఆశలు నెరవేరే స్థలం స్వర్గం మాత్రమే. అయితే, స్వర్గం కావాలని కోరుకున్న వారికి మాత్రమే, అది దొరుకుతుంది. ఏకేశ్వరోపాసన, దైవారాధన మాత్రమే మనిషిని స్వర్గంవైపు తీసుకెళ్ళగలవు.

## స్వర్గ శుభవార్త

దివ్యఖుర్ఆన్ వాస్తవానికి మోక్షం వైపు సందేశాన్ని కూడా ఇస్తుంది.

وَاللَّهُ يَدْعُو إِلَى الْجَنَّةِ وَالْمَغْفِرَةِ بِإِذْنِهِ وَيُبَيِّنُ آيَاتِهِ لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَذَكَّرُونَ

అల్లాహ్ తన అనుజ్ఞతో మిమ్మల్ని స్వర్గం వైపునకూ క్షమాభిక్ష వైపునకూ రమ్మని పిలుస్తాడు. గుణపాఠం గ్రహించి హితబోధను స్వీకరిస్తారని ప్రజలకు అల్లాహ్ తన ఆజ్ఞలను స్పష్టంగా తెలుపుతాడు.
(అల్‌బఖర:221)

## శాంతి సందేశం

సురక్షితమైన శాంతి భద్రతల స్థలం స్వర్గమే. అక్కడ ఎలాంటి అల్లరిగోల ఉండదు. అల్లాహ్ ఉపదేశాలను స్వీకరించి, యదార్థానికి విముఖత చూపని వారికి ఈ స్వర్గం లభిస్తుంది. వారి గురించి ఇలా తెలియ జేయబడింది:

لَهُمْ دَارُ السَّلٰمِ عِنْدَ رَبِّهِمْ وَهُوَ وَلِيُّهُمْ بِمَا كَانُوا يَعْمَلُوْنَ۔

వారు చేసుకున్న కర్మల ఫలితంగా, వారి ప్రభువు వద్ద వారికొరకు సురక్షిత మైన నివాసం ఉంది. వారి పోషకుడు ఆయనే. (అల్ అన్ఆమ్:27)

స్వర్గానికి మారుపేరే సురక్షితమైన శాంతి భద్రతల స్థలం. సురక్షితం వైపు సందేశమే స్వర్గపు సందేశం.

## మోక్షం వైపు సందేశం

దివ్యఖుర్ఆన్ సందేశం దైవశిక్ష నుండి విముక్తి కలిగించే సందేశం కూడా! విశ్వాసి పలికే వాక్యాలను దివ్యఖుర్ఆన్ ఇలా తెలుపుతుంది.

وَيٰقَوْمِ مَا لِيْٓ اَدْعُوْكُمْ اِلَى النَّجٰوةِ وَتَدْعُوْنَنِيْٓ اِلَى النَّارِ تَدْعُوْنَنِيْ لِاَكْفُرَ بِاللّٰهِ وَاُشْرِكَ بِهٖ مَا لَيْسَ لِيْ بِهٖ عِلْمٌ وَّاَنَا اَدْعُوْكُمْ اِلَى الْعَزِيْزِ الْغَفَّارِ

నేను మిమ్మల్ని ముక్తివైపునకు పిలుస్తున్నాను, మీరేమో నన్ను అగ్ని వైపునకు పిలుస్తున్నారు. నేను అల్లాహ్‌ను తిరస్కరించాలనీ, నేను ఎరుగని శక్తులను ఆయనకు భాగస్వాములుగా నిలబెట్టాలనీ మీరు నాకు పిలుపునిస్తున్నారు. నిజానికి నేను మిమ్మల్ని సర్వశక్తి సంపన్నుడూ, క్షమాశీలుడూ అయిన దేవుని వైపునకు పిలుస్తున్నాను. (అల్ మూమినూన్:41,42)

అంటే, అల్లాహ్ వైపు మరలడంలోనే ముక్తి, మోక్షాలు ఉన్నాయని

అర్థం. అలాకాక పరుల కొరకు పట్టుకోవడమంటే అల్లాహ్ శిక్షను ఆహ్వానించడమే. పర్యవసానం నరకాగ్ని తప్ప మరేమీ కాదు.

ఇస్లాం సందేశంలోని ఈ విభిన్న పార్శ్వాలన్నీ నిజానికి వివేకంతో కూడిన సందేశం పరిధిలోకి వస్తాయి. దీనివల్ల ఒకవైపు సందేశానికి సంబంధించిన వివిధ పార్శ్వాలు ప్రజలకు వెల్లడవుతాయి, మరోవైపు వారు ఈ సందేశంపట్ల ఆకర్షితులై, దాన్ని తమ హృదయాల్లో దాచుకోదగినదిగా పరిణమిస్తుంది. లేక మానవుని అసలు నైజాన్నే సందేశానికి పునాదిగా నిర్ణయిస్తుంది. నిజంగా సందేశాన్ని, దాని వాస్తవరూపంలో పరిచయం చేసినట్లయితే ఇస్లాం సందేశం స్వయంగా దానంతట అదే మనిషిని తన వైపుకు ఆకర్షించి, అనుసరించేలా, స్వీకరించేలా చేయగలుగుతుంది. కళ్ళుండీ చూడలేని గుడ్డివాడు, లేదా అజ్ఞానంతో ఎలాగైనా ఈ సందేశాన్ని తిరస్కరించాలి అని భీష్మించుకున్న మూర్ఖుడు తప్ప మరెవరూ దీన్ని వ్యతిరేకించలేరు. పూల వైపు ప్రజలు ఆకర్షించబడాలంటే, అవి మరేమీ చేయాల్సిన అవసరం లేదు. స్వతః సిద్ధంగా వాటిలో ఉన్న సౌందర్యం, పరిమళమే చాలు. అందుకని ఇస్లాంలోని శుభాలు, దాని ఆకర్షణ ప్రజలకు విదితమవడం చాలా అవసరం. సత్యాన్ని ఈ విధంగా ప్రజల ముందుంచగలిగినప్పుడే అది వారి హృదయాలను ఆక్రమించగలుగుతుంది.

విద్యాజ్ఞానం, అవగాహనా లోపం వల్ల అనేకసార్లు యదార్థం యొక్క అంతర్ బాహ్యాల శ్రేష్ఠతలను బహిర్గతం చేయలేకపోవడం వల్ల ఇదొక కఠినమైన చట్టంగా సమాజం ముందు ఆవిష్కృతమవుతోంది. అందుకని ఇది మనిషిని మానసికంగా సంతోషపెట్టగలగడం లేదు. ఈ సత్యధర్మం తప్పుకాదు. ఇది ఖచ్చితంగా సందేశం అందజేసే వారి తప్పు. అవగాహన లేకుండా దీనిని ప్రజలకు పరిచయం చేసే సందేశకులదే తప్పంతా. ఇలాంటివారు దీనిని ప్రజలకు పరిచయం చేసేటప్పుడు నమ్మకంగా, ధైర్యంగా ఇలా అనలేరు.

Take the manna of today, it is not a code of life but life also.

వారికి మత ధర్మంలో శాస్త్రము, చట్టపు జీవితం తప్ప వాస్తవ జీవితం మచ్చుకైనా కానరావడం లేదు. అయితే, దివ్యఖుర్ఆన్ దీనిని తప్పనిసరిగా పరిగణించింది.

## పునశ్చరణ

ధర్మశాస్త్రాన్ని మనిషి కాదనుకున్నప్పటికీ, దానిని అతనిపై రుద్దేటటు వంటి వస్తువు కాదని దివ్యఖుర్ఆన్ తెలియజేస్తుంది. అల్లాహ్‌ను విశ్వసించడం, ఆయన దాస్యం పట్ల ఆసక్తి కలిగి ఉండటం మనిషి స్వభావం. మనిషి మరచిపోయిన పాఠాన్ని అల్లాహ్ గ్రంథం దివ్యఖుర్ఆన్ మనకు గుర్తు చేస్తుంది.

أَوَعَجِبْتُمْ أَن جَاءَكُمْ ذِكْرٌ مِّن رَّبِّكُمْ عَلَىٰ رَجُلٍ مِّنكُمْ لِيُنذِرَكُمْ وَلِتَتَّقُوا وَلَعَلَّكُمْ تُرْحَمُونَ-

మీకు ఆశ్చర్యం కలిగిందా, మీ వద్దకు స్వయంగా మీ జాతికి చెందిన ఒక మనిషి ద్వారా మీ ప్రభువు జ్ఞాపిక వచ్చిందని- మిమ్మల్ని హెచ్చరించటానికి, మీరు చెడు నడతకు దూరంగా ఉండడానికి, మీపై దయచూపడానికి?
(అల్ఆరాఫ్:63)

ధర్మనిష్ఠ, దైవభీతి మనిషి స్వభావంలో దైవికంగా న్యాసమై ఉన్నాయి. దైవవాణి వల్ల మనిషికి ఏ సందేశమయితే అందిందో, ఆ దివ్యబోధనలను విశదపరచి, రుజువు చేసే పద్ధతి అతనికి జన్మతః ప్రసాదించబడింది. దివ్యఖుర్ఆన్‌లో ఇలా ఉంది:

وَنَفْسٍ وَمَا سَوَّاهَا فَأَلْهَمَهَا فُجُورَهَا وَتَقْوَاهَا-

మన ఆత్మసాక్షిగా, ఆ ఆత్మకును తీర్చిదిద్ది, ఆపై దానికి సంబంధించిన మంచీచెడులను దానికి తెలియజేసినవాడు సాక్షిగా. (అష్షమ్స్:7,8)

"కీడు, చెడు అంటే ఏమిటి? నిజమైన దైవభీతి అంటే ఏమిటి?"

వంటి అంశాల గురించి ఆలోచించే బుద్ధిజ్ఞానాలను ప్రకృతిసిద్ధంగా అతనికి ప్రసాదించబడ్డాయి. ఈ బుద్ధిజ్ఞానాలనే దివ్యబోధనలు అంటాం. ఈ విషయంలో సందేహించడమంటే తమ ఉనికిని తాము సందేహించు కోవడమే. ఏ వ్యక్తికైనా సందేశమివ్వడమంటే అతనుమరచిపోయిన దాన్ని అతనికి గుర్తు చేయడమే. ప్రవక్త (సఅసం) అతడు మరచిపోయిన దాన్ని గుర్తుచేయడానికే ప్రజలముందుకొస్తాడు. ప్రవక్త చెప్పే విషయాలు మనిషి స్వభావానికి వ్యతిరేకం ఏమీ కాదు, దివ్యఖుర్ఆన్‌లో ఉఇలా ఉంది:

قَدْ اَنْزَلَ اللّٰهُ اِلَيْكُمْ ذِكْرًا ۝ رَّسُوْلًا يَّتْلُوْا عَلَيْكُمْ اٰيٰتِ اللّٰهِ مُبَيِّنٰتٍ -

అల్లాహ్ మీ వద్దకు ఒక హితబోధను పంపాడు. ఒక ప్రవక్తను పంపాడు. అతను మీకు స్పష్టమైన మార్గం చూపే అల్లాహ్ ఆయత్‌లను వినిపిస్తున్నాడు.
(అత్ తలాఖ్:10,11)

## విశ్వాసం - కృతజ్ఞత

సర్వమానవుల కొరకు అల్లాహ్ ప్రసాదించిన అమూల్యమైన అనుగ్రహాలను దివ్యఖురాన్ గుర్తుచేసి మానవుడి హృదయంలో నిబిడీకృతమై ఉన్నటువంటి కృతజ్ఞతాభావాన్ని వెలికితీస్తుంది. మానవుడు నైతికతకు ప్రతిరూపం కాబట్టి అతడు తన యజమాని, ప్రభువుకు కృతజ్ఞుడై ఉండాలి తప్ప కృతఘ్నుత చూపరాదు. సర్వమానవులకు అన్నపానీయాలను సమకూర్చేవాడు అల్లాహ్‌యే. అందువల్ల ప్రతి మనిషి అన్నపానీయాలను సేవించి దైవం పట్ల కృతజ్ఞతా భావం కలిగి ఉండాలి. అల్లాహ్ మనిషికి తనువు (ఉదరము)తోపాటు హృదయాన్ని కూడా ప్రసాదించాడు.

كُلُوْا مِنْ رِّزْقِ رَبِّكُمْ وَاشْكُرُوْا لَهٗ

మీ ప్రభువు ప్రసాదించిన దానిని తినండి. ఆయనకు కృతజ్ఞతలు తెలుపండి. (సబా:15)

كُلُوْا مِنْ طَيِّبَاتِ مَا رَزَقْنٰكُمْ وَاشْكُرُوا لِلّٰهِ إِنْ كُنْتُمْ إِيَّاهُ تَعْبُدُوْنَ

నిజంగానే మీరు అల్లాహ్ ఆరాధకు లయితే, మేము మీకు ప్రసాదించిన పరిశుభ్రమయిన వస్తువులను నిస్సం కోచంగా తినండి. అల్లాహ్‌కు కృతజ్ఞ తలు తెలుపండి. (అల్‌బఖర:172)

ఈ విధమైన కృతజ్ఞతాభావమే విశ్వాసానికి మూలం. ఇలాంటి విశ్వాసమే గౌరవ ప్రదమైనది, ప్రియమైనది. ఇలాంటి విశ్వాసమే జీవిత లక్ష్యం. విశ్వాసం ఇంద్రియ గోచర యదార్థమైతే, యదార్థస్థానం మనిషికి ఆహారం వంటిది. ఇది లేకుండా మనిషి జీవించలేడు. అలాంటి విశ్వాసం ఎప్పుడు రసహీనమైనదిగా ఉండిపోదు. నిస్సందేహంగా విశ్వాసం కృతజ్ఞతా భావం పైన్నే ఆధారపడి ఉంది. దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

مَا يَفْعَلُ اللّٰهُ بِعَذَابِكُمْ إِنْ شَكَرْتُمْ وَآمَنْتُمْ وَكَانَ اللّٰهُ شَاكِرًا عَلِيْمًا

మీరు కృతజ్ఞతలు చూపే దాసులుగా ఉన్నప్పుడు, విశ్వాసమార్గంలో నడుస్తూ ఉన్నప్పుడు మిమ్మల్ని అల్లాహ్ నిష్కార ణంగా ఎందుకు శిక్షిస్తాడు? అల్లాహ్ యోగ్యతకు ఎంతో విలువ ఇస్తాడు. ఆయన అందరి స్థితిని ఎరిగినవాడు.
(అన్‌నిసా:147)

కృతజ్ఞతాభావం గలవాడే ఇంకా ఎక్కువ పొందడానికి అర్హుడవుతాడు. ఇహలోకంలో కృతజ్ఞతాభావంతో జీవించనట్లయితే అతనికి ఎనలేని అనుగ్రహాలు ప్రసాదించబడతాయి.

لَئِنْ شَكَرْتُمْ لَأَزِيْدَنَّكُمْ وَلَئِنْ كَفَرْتُمْ إِنَّ عَذَابِيْ لَشَدِيْدٌ۔

మీరుగనక కృతజ్ఞులైతే, నేను మిమ్మల్ని ఇంకా ఎక్కువగా అనుగ్రహిస్తాను. ఒకవేళ కృతఘ్నతకు పాల్పడితే నా శిక్ష చాలా కఠినంగా ఉంటుంది.
(ఇబ్రాహీమ్-7)

ప్రళయ దినాన ఈ సౌఖ్యాలు, అనుగ్రహాల గురించి ప్రశ్నించడం జరుగుతుంది.

ఆ రోజున మీరు తప్పని సరిగా ఈ సౌఖ్యాల గురించి ప్రశ్నించబడతారు.
(అత్ తకాసుర్-8)

لَتُسْـَٔلُنَّ يَوْمَئِذٍ عَنِ النَّعِيْمِ

యదార్థాన్ని అంగీకరించేవారు బ్రతికి ఉన్నవారుగా, వ్యతిరేకించేవారు చనిపోయినవారుగా పరిగణించబడతారు. యదార్థంపై ఉన్నవారిని జ్ఞానులుగాను, యదార్థానికి దూరమైన వారిని అజ్ఞానులుగా పరిగణించ బడతారు. కండ్లు ఉన్న వర్గం ఒకటైతే, కండ్లులేనిది రెండవది. పూర్తి వెలుగులో జీవించే వారొకరైతే, చీకటిలో దిమ్మరిలా తిరిగేవారు మరొకరు. అందుకే మనిషి ఆలోచించి పని చెయ్యాలి. మనిషి మృత్యువుకంటే జీవితాన్ని, అజ్ఞానం కంటే విజ్ఞానానికి, గుడ్డితనం కంటే చూపును, చీకటికంటే వెలుగుకు ప్రాధాన్యత నివ్వాలి. ఈ వాస్తవాన్ని దివ్యఖుర్ఆన్ ఈ విధంగా తెలియజేస్తుంది.

గుడ్డివాడూ, కళ్ళున్నవాడూ సమానులు కాలేరు. చీకటీ- వెలుగూ ఒకటికావు. చల్లని నీడా-ఎండ తాపమూ ఒకే విధంగా ఉండవు. బ్రతికి ఉన్నవారూ, చనిపోయినవారూ సమానులు కాలేరు.
(ఫాతిర్ : 19-22)

وَمَا يَسْتَوِي الْاَعْمٰى وَالْبَصِيْرُ
وَلَا الظُّلُمٰتُ وَلَا النُّوْرُ ○
وَلَا الظِّلُّ وَلَا الْحَرُوْرُ ○ وَمَا
يَسْتَوِي الْاَحْيَاۤءُ وَلَا الْاَمْوَاتُ

## సజీవుల అన్వేషణ

ఎవరయితే ఉత్సాహంగా ఉంటారో, వారే జీవన సందేశాన్ని వినగలరు. నిర్జీవులు చెవిటివారు దీనిని వినలేరు. నీవు మృత్యులకు వినిపించలేవు, వెన్నుతిప్పి పారిపోయే బధిరులకు కూడా నీ పిలుపును వినిపించలేవు.
(నమ్ల్:80)

اِنَّكَ لَا تُسْمِعُ الْمَوْتٰى وَلَا تُسْمِعُ
الصُّمَّ الدُّعَاۤءَ اِذَا وَلَّوْا مُدْبِرِيْنَ-

ఇదే విషయాన్ని దివ్యఖుర్‌ఆన్ మరోచోట ఇలా తెలియజేసింది:

إِنْ هُوَ إِلَّا ذِكْرٌ وَقُرْآنٌ مُّبِينٌ
لِّيُنذِرَ مَن كَانَ حَيًّا وَيَحِقَّ الْقَوْلُ
عَلَى الْكَافِرِينَ

ఇది ఒక హితబోధ మాత్రమే, స్పష్టంగా పఠనీయమైన గ్రంథం మాత్ర అతను బ్రతికి ఉన్న ప్రతి మనిషిని హెచ్చరించేందుకూ, తిరస్కారులకు వ్యతిరేకంగా అభియోగం స్థాపించ బడేందుకు. (యాసీన్:69,70)

జీవన సందేశం కోసం జీవితాలను అన్వేషించవలసి ఉంటుంది. మృతులలో జీవంపోసే ప్రయత్నమైతే చేయవచ్చు. కాని, ఎక్కువ సమయాన్ని వారికై వెచ్చించేబదులు, ఇతరులకై శ్రద్ధ కలిగించడం ఎంతైనా అవసరం.

## దైవదాస్యపు సందేశం

బుద్ధిజ్ఞానము ఉన్నవారు దైవదాస్యపు ఔన్నత్యాన్ని గ్రహించగలరు. ఉత్సాహం కలిగివుండి, ఆత్మలు మృత్యుపరం కాకుండా ఉన్నవారు ఈ సందేశాన్ని తప్పకుండా స్వీకరిస్తారు. ప్రపంచపు ఏ వస్తువు కూడా వారి అభిప్రాయాల నుండి వారిని దూరం చెయ్యలేదు.

అల్లాహ్ రంగును స్వీకరించండి. అల్లాహ్ రంగుకంటే మరెవరి రంగు శ్రేష్ఠతరమైనది? మేము కేవలం ఆయననే ఆరాధిస్తాము. సందేశవిధిని వివేక విజ్ఞతలతో పరిచయం చేసే విధానం ధర్మం ప్రారంభమైన తొలి దశలోనే ప్రారంభమయింది. ఈ విధానం వల్ల దివ్యఖుర్‌ఆన్‌తో ప్రభావితులై విశ్వ సించినవారు చాలా మంది ఉన్నారు. దివ్యఖుర్‌ఆన్ ప్రభావం చూపుటకు కారణం ఏమిటంటే- అది సత్యసంధతతోపాటు పవిత్రత, న్యాయ బద్ధతకు అధిక ప్రాధాన్యతనిస్తుంది.

ఇస్లాం సందేశాన్ని పరిచయం చేసే ముందు దాని నియమ నిబంధన లను గురించి తెలుసుకోవడం చాలా అవసరం. ఉదాహరణకు దానికి సంబం ధించిన కొన్ని విషయాల ప్రస్తావన ఇక్కడ ఇవ్వడం జరుగుతుంది.

## సులభతరం చెయ్యడం

ధర్మాన్ని కష్టతరం చేసి తెలియజేయడం కంటే, దానిని సులభతరం చేసి మంచి పద్ధతిలో తెలియజేయడం సందేశకుల కర్తవ్యం.

దివ్యఖుర్ఆన్‌లో తెలియజేయబడింది:

صِبْغَةَ اللّٰهِ ۚ وَمَنْ اَحْسَنُ مِنَ اللّٰهِ صِبْغَةً ۫ وَّنَحْنُ لَهٗ عٰبِدُوْنَ ـ

అల్లాహ్ మీపట్ల మెతక వైఖరికి కన బరుస్తున్నాడు. మీపట్ల కఠినంగా వ్యవహరించాలని ఆయన కోరుకోవడం లేదు.

మరోచోట ఇలా తెలియజేయబడింది:

يُرِيْدُ اللّٰهُ بِكُمُ الْيُسْرَ وَلَا يُرِيْدُ بِكُمُ الْعُسْرَ

ఏ ప్రాణిపైనా అల్లాహ్ దాని శక్తి సామర్థ్యాలకు మించిన బరువు బాధ్యతలను మోపడు. (అల్‌బఖర:286)

విశ్వసించిన వారి గురించి ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా తెలిపారు:

మీరయితే సులభతరం చెయ్యడానికి పంపించబడ్డారు గాని, కష్టతరం చెయ్యడానికి కాదు. (బుఖారి)

మరోచోట ఆయన (సఅసం) ఇలా తెలిపారు:

సులభతరం చెయ్యండి. కష్టంలో పడవేయకండి. ఉపశమనాన్ని కలిగించండి. అసహ్య పరచకండి. (బుఖారి, ముస్లిం)

అబూదావూద్ ఉల్లేఖనం: హజ్రత్ అబూమూసా (రజి) తెలిపారు. 'ప్రవక్త (స) తన సహచరులను ఏదయినా పని మీద పంపిస్తే ఇలా తెలిపే వారు. వారికి శుభవార్త నివ్వండి, సంతోషపెట్టండి, అయిష్టత మరియు అసహ్యతను పెంచకండి, సులభతరం చెయ్యండి, ఇబ్బందుల్లో, కష్టంలో పడవేయకండి.'

హజ్రత్ ఇబ్నే అబ్బాస్ (రజి) ఉల్లేఖించారు. ప్రవక్త (సఅసం) ఇలా తెలిపారు: "ధర్మాన్ని నేర్పించండి, సులభతరాన్ని పుట్టించండి. ధర్మాన్ని నేర్పించండి, సులభతరాన్ని పుట్టించండి." ఈ విషయాన్ని ఆయన (సఅసం) మూడు సార్లు తెలియజేశారు. (అదబుల్ ముఫ్రిద్)

మరో సందర్భంలో ప్రవక్త (సఅసం) హజ్రత్ ముఆజ్ (రజి) మరియు అబూ మూసా (రజి)లను యమన్ వైపు పంపిస్తూ ఇలా తెలిపారు.

మీరిద్దరూ సులభతరం చెయ్యండి, కాఠిన్యంతో పనిచేయించకండి, సంతోషంగా పలకరించండి, ప్రజలకు రోత పుట్టించకండి. ఒకరికొకరు కలిసి మెలిసి ఉండండి, మనస్పర్థలు, జగడాలు పెట్టుకొని కూర్చోకండి.

ధర్మసేవ చేసేవారు ఉదాసీనత, అసహనతను పెంచే బదులు ప్రజల సంతోషం కొరకు పని చెయ్యాలని ఈ ఉల్లేఖనాల ద్వారా తెలుస్తుంది. కాఠిన్యానికి బదులు మాధుర్యాన్ని పెంచండి.

హజ్రత్ మూసా (అలై), హజ్రత్ హారూన్ (అలై)లను ఫిరౌన్ వైపు పంపిస్తూ అల్లాహ్ ఇలా తెలిపాడు:

اِذْهَبَآ اِلٰى فِرْعَوْنَ اِنَّهٗ طَغٰى ۝ فَقُوْلَا لَهٗ قَوْلًا لَّيِّنًا لَّعَلَّهٗ يَتَذَكَّرُ اَوْ يَخْشٰى

మీరు ఇద్దరూ కలిసి ఫిరౌన్ వద్దకు వెళ్ళండి,. అతడు ధిక్కారి అయి పోయాడు. అతనితో మృదువుగా మాట్లాడండి, బహుశా అతడు హిత బోధను స్వీకరిస్తాడేమో లేదా (దేవునికి భయపడతాడేమో. (తాహా - 43, 44)

## క్రమపద్ధతిలో మాట్లాడడం

సాధారణంగా ఎదుటి వ్యక్తి సంభాషణ స్థాయిని లెక్కిస్తూ, ధర్మం మౌలికాంశాలను ఒక వరుస క్రమంలో తెలియజెయ్యాలి. విషయాలన్నీ ఒకేసారి తెలపాలని ఏమీ లేదు. బుఖారి, ముస్లిం హదీసులలో ఇలా ఉంది:

హజ్రత్ ఇబ్నె అబ్బాస్ (రజి) ఉల్లేఖించారు. ముహమ్మద్ (సఅసం), హజ్రత్ ముఆజ్ (రజి)కు యమన్ దేశానికి పంపిస్తూ ఇలా తెలిపారు. నీవు విశ్వసించిన వారి వైపునకు వెళ్తున్నావు. అల్లాహ్ తప్ప మరో ఆరాధ్యుడు లేడు, ముహమ్మద్ అల్లాహ్ పంపిన ప్రవక్త అని సందేశమివ్వండి. దీనిని వారు అంగీకరించినట్లయితే, అల్లాహ్ మీపై రోజుకు అయిదుసార్లు నమాజ్ విధిగా చేశాడు అని తెలపండి. వారు దానిని కూడా అంగీకరించినట్లయితే, అల్లాహ్ ధనికులపై, జకాత్‌ను విధిగా నిర్ణయించాడు. దానిని ధనికుల నుండి వసూలు చేసి అక్కడ ఉండే బీదసాదలకు పంచబడుతుంది అని చెప్పండి. వారు దానిని కూడా అంగీకరించినట్లయితే, జాగ్రత్త సుమా! వారి మంచి ధనాన్ని అపహరించవద్దు. ఇంకా పీడితుల విన్నపాన్ని పరిగణలోకి తీసుకోండి. ఎందుకంటే, అల్లాహ్‌కు పీడితులకు మధ్య ఎలాంటి పరదా ఉండదు. (బుఖారి, ముస్లిం)

ధర్మాన్ని ప్రజలకు ఎంత సులువుగా, దానిని స్వీకారయోగ్యమయ్యేలా బోధించాలో ఈ హదీసు ద్వారా తెలుస్తుంది. సాధారణ సమయాలలో దానధర్మాలు చెయ్యడం మనసుకు కష్టంగా ఉంటుంది. ఈ విషయంలో మొదటి విషయం ఏమిటంటే, "దానధర్మాలు చెయ్యమని అల్లాహ్ తరపున ఆదేశించడం జరిగింది." రెండవ విషయం- ఇది కూడా అందరూ చేయ వలసిన అవసరం లేదు. ఇది ధనికులపై మాత్రమే విధిగా చేయబడింది. బీదసాదలు దీని నుండి మినహాయించబడ్డారు. మూడవ విషయం- దాన ధర్మాలు చేసినవారు, నా డబ్బు నా నుండి దూరమయిందని ఎట్టి పరిస్థితి లోనూ అనుకోరాదు. ధనికుల నుండి వసూలు చేయబడిన ధనాన్ని అక్కడి బీదసాదలకే పంచిఇవ్వాలి.

ఈ విధంగా దానధర్మాలు చేసేవారి మనసులో ఉత్సాహాన్ని పెంచి, దానధర్మాలు చెయ్యడం బలవంతపు పనికాదు, ఇది మంచిపనిగా నైతిక ధర్మంగా అభివర్ణించి, దానధర్మాలు చెయ్యడాన్ని సులభతరం చేయడం జరిగింది. ఈ సందర్భంలోనే దానధర్మాల వల్ల ప్రళయదినాన లభించే

పుణ్యఫలాలను తెలియజేయడం వల్ల ఇంకా ఎక్కువ లాభం చేకూరుతుంది. దానధర్మాలను వసూలు చేసే క్రమంలో మంచిమంచి వస్తువులు మాత్రమే స్వీకరించాలనుకోరాదు. అలా చేస్తే దానధర్మాలు చేసే వ్యక్తి మనసు గాయ పడుతుంది.

## సందేశగ్రాహకుని విద్యాజ్ఞానాల అంచనా

సందేశ ప్రచారంలో సందేశగ్రాహకుని విద్యాజ్ఞానాలను అంచనా వేసి సందేశమివ్వడం చాలా అవసరం. దాని అంచనా హజ్రత్ జాబిర్ బిన్ సలీమ్ (రజి) ఉల్లేఖనం ద్వారా తెలుస్తుంది. వారు ఇలా అన్నారు- నేను ప్రవక్త ముహమ్మద్ (సఅసం) దగ్గరికి వెళ్ళి అడిగాను:

మీరు అల్లాహ్ ద్వారా పంపించబడిన ప్రవక్తనా? దానికి ఆయన (సఅసం) తెలిపారు: నేను ఆ సృష్టికర్త ప్రవక్తను, ఆయన ఎవరంటే- మీకు ఏదయినా కష్టం, నష్టం కలిగినప్పుడు, మీరు ఆయనతో వేడుకుంటే, దానిని దూరం చేస్తాడు. ఏ సంవత్సరం అయినా మీపై కరువు వచ్చినప్పుడు ఆయన్ని వేడుకుంటే, దానిని దూరం చేసి ధాన్యాలను పండిస్తాడు. ఇంకా, మీరు ఎడారిలో ఉన్నప్పుడు అనుకోకుండా మీ ఒంటె మీకు దూరమై పోయినప్పుడు ఆయనతో వేడుకుంటే, దానిని వెనక్కు రప్పిస్తాడు. హజ్రత్ జాబిర్ (రజి) తెలిపారు: " నాకు ఏదయినా ఉపదేశం చెయ్యండి." ఆయన (సఅసం) తెలిపారు: ఎవ్వరినీ తిట్టవద్దు". జాబిర్ తెలిపారు: ఆ రోజు నుండి నేను స్వతంత్రుడినిగాని, బానిసనుగాని, ఒంటెను గాని, మేకను గాని తిట్టలేదు". తరువాత ఆయన (సఅసం) తెలిపారు: "ఎవరయినా నీకు ఏదయినా వస్తువును కానుకగా పంపిస్తే, దానిని హీనమైనదిగా భావించకు, నీతోటి సోదరులతో హృదయ పూర్వకంగా సంభాషించు. ఎందుకంటే ఇదే ఉత్తమమైన పద్ధతి.

హజ్రత్ జాబిర్ (రజి) తెలియజేశారు. ప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇంకా ఇలా తెలిపారు:

ఇరువురి మధ్య మనస్పర్థలు పుట్టించడం, వారి గౌరవ మర్యాదలను కించపరచడం చెయ్యరాదు. ఇది అహంకారపు పని. అల్లాహ్‌కు ఇది చాలా అయిష్టతమైనది. ఎవరయినా మీకు తిట్టినా, మీ దోషాలను ఎత్తిచూపినా, మీకు అతని గురించి తెలిసిన దోషాలను నలుగురితో బహిర్గతం చెయ్యకండి. ఎందుకంటే ఎవరిపాపం వారికే ఉంటుంది. (అబూదావూద్)

సందేశకుడు ఎదుటి వ్యక్తి విద్యాజ్ఞానాలు, ఆలోచనా విధానాలను దృష్టిలో ఉంచుకొని సంభాషించాలి. ఒక సాధారణ అరబ్ వ్యక్తి మేధాశక్తి, అతను నివసిస్తున్న వాతావరణ పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని తాను ఏ దేవుని ప్రవక్తో తెలుపుతారు. కష్టాల్లో మనం ఎవరిని వేడుకుంటామో, దాసులను కరుణించి వారి చిన్నాపెద్ద కష్టాలను దూరం చేస్తాడో ఆ దేవుని ప్రవక్తను. కాబట్టి అలాంటి కరుణామయుడైన దేవుని ప్రవక్త సందేశాన్ని వినడం, స్వీకరించడం మీకోసం తప్పనిసరి.

తరువాత ప్రవక్త (స) హజ్రత్ జాబిర్ (రజి)కు తెలిపిన ఉపదేశాలు మనిషి దైనందిన జీవితంతో ముడిపడి ఉన్నాయి. వాస్తవ జీవితంలో ఉపయోగపడేదే నిజమైన ఉపదేశం. ఆచరణశూన్యమైన ఉపదేశం వల్ల ప్రయోజనం ఉండదు.

## లజ్జా, బిడియాలు- ఆత్మాభిమానం

సిగ్గు, బిడియాలు స్వాభావికమైనవి. ధర్మంలో వీటికొక ప్రత్యేక స్థానముంది.

ఒక ప్రవచనంలో ప్రవక్త (సఅసం) తెలిపారు:

ప్రతి ధర్మానికీ ఒక స్వభావం ఉంటుంది. అయితే, సిగ్గు బిడియాలు ఇస్లాం స్వభావం. (ఇబ్నెమాజ, బైహఖీ ఈమాన్ అధ్యాయం)

బుఖారి, ముస్లింలోని మరో ప్రవచనంలో ఇలా తెలిపారు:

అల్లాహ్ బిడియం ఏమిటంటే- అతను బహిరంగమైన లేదా గుప్తమైన

అన్నిరకాల సిగ్గులేని పనులను నిషేధించాడు.

అంటే, అల్లాహ్ సిగ్గుమాలిన పనుల నుండి వారించాడంటే, దాని వెనుక ఆయన బిడియం పని చేస్తుందన్న మాట. ఒక మనిషి సిగ్గు బిడియాలు ధర్మంకోసమే అయినట్లయితే, ధర్మంతో అతని స్వభావం ఏకాభిప్రాయాన్ని కలిగి ఉందని చెప్పవచ్చును.

ఇక నుండి అతను ధర్మాభిప్రాయాలకు దూరంగా ఉండలేడు. అలాగే ధర్మం కూడా అతని మూర్తిమత్వానికి వ్యతిరేకం కాదు.

ధర్మంకోసం మనిషిలో సిగ్గుబిడియాలను తట్టి లేపడం సందేశకుని విధి అవుతుంది. ఒక వ్యక్తిలో ఉన్న సిగ్గు బిడియాల శక్తి నుండి సందేశకుడు లాభం పొందడానికి ప్రయత్నం చెయ్యాలి. దీని ఉదాహరణ ప్రవక్త (సఅసం) గారి గుణగణాల ద్వారా తెలుస్తుంది.

ప్రవక్త (సఅసం) తాయఫ్ పట్టణం నుండి తిరిగి వచ్చిన తరువాత కాబా చుట్టూ ప్రదక్షిణ చేస్తున్నారు. అబూ జహల్‌తోపాటు మరికొందరు అక్కడే ఉన్నారు. అబూజహల్ వారిని ఉద్దేశించి మునాఫ్ వంశస్తులారా! ఇతనే మీ ప్రవక్త అన్నాడు వెటకారంగా. వారిలోనే హాషమీ వంశానికి చెందిన ఉత్‌బాబిన్ రబియా కూడా ఉన్నాడు. అతను కూడా విగ్రహారాధకుడే అయినప్పటికీ అబూజహెల్ మాటల్ని భరించలేక, అయితే ఏంటంట? మాలో ఒక ప్రవక్త ప్రభవిస్తే, లేక ఎవరికైనా రాజ్యాధికారం ప్రాప్తిసే ఇందులో వింతేముంది? దానికి ఇంతగా మండిపడే విషయం ఏముంది? అన్నాడు.

ప్రవక్త (సఅం) అతని నోటి నుండి ఈ మాటలు విన్న తరువాత ఇలా అన్నారు: "చాలా ఆశ్చర్యంగా ఉంది ఉత్‌బా! అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త గారిపై మాత్రం నీకు అభిమానం కలగలేదు. కాని నీ వంశం కోసం మాత్రం రోషం వచ్చింది. అంటే నీ అభిమాన బిడియాల పరిమాణం చాలా స్వల్పంగా ఉంది. నీవు వాస్తవాన్ని గ్రహించగలిగి ఉంటే ఒక మనిషికంటే కూడా అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తకు ఒక కుటుంబం లేదా వంశంకంటే

ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చేవాడివి.

## మనోభావాలను గౌరవించడం

సందేశం ఇచ్చేటప్పుడు ఎదుటి వ్యక్తి లేదా జాతి గురించి తెలుసు కోవడం, వారి మనోభావాలను గౌరవించడం చాలా అవసరం. దివ్యఖుర్‌ఆన్ యొక్క ఈ ఆయత్‌ల ద్వారా దీనిని అంచనా వెయ్యగలం.

قُلْ يَٰٓأَهْلَ ٱلْكِتَٰبِ تَعَالَوْا۟ إِلَىٰ
كَلِمَةٍ سَوَآءٍۭ بَيْنَنَا وَبَيْنَكُمْ
أَلَّا نَعْبُدَ إِلَّا ٱللَّهَ وَلَا نُشْرِكَ
بِهِۦ شَيْـًٔا وَلَا يَتَّخِذَ بَعْضُنَا
بَعْضًا أَرْبَابًا مِّن دُونِ ٱللَّهِ

ఇలా చెప్పు; "గ్రంథ ప్రజలారా! మాకూ మీకు మధ్య సమానమైన ఒక విషయం వైపునకు రండి. (అది ఏమిటంటే) మనం అల్లాహ్‌కు తప్ప మరెవరికీ దాస్యం చెయ్యరాదు. ఆయనకు భాగస్వాములుగా ఎవరినీ నిలబెట్టరాదు. మనలోని వారెవరూ అల్లాహ్‌ను తప్ప మరెవరినీ తమ ప్రభువుగా చేసుకోరాదు అనేది. (ఆలి ఇమ్రాన్-64)

ఈ ఆయత్‌లలో మొదటిసారిగా ప్రస్తావించిన విషయం ఏమిటంటే- యూదులు మార్గవిహీనమై, వక్రగతి పొంది, మూర్తులపై విశ్వాసం కలిగి ఉన్నా వారిని మార్గభ్రష్టులారా, విగ్రహారాధకులారా! అని సంబోధించక- వారి గొప్పతనం, గౌరవ మర్యాదలు ఉట్టిపడేలా సంబోధించడం జరిగింది. దీనివల్ల వారి గౌరవ మర్యాదలకు ఔన్నత్యం పెరిగింది. ఇంకా మా ఏకేశ్వరోపాసన సందేశం మీరు ఎరుగనిదిగాని, మీకు పరిచయం లేనిది గాని కాదు. వాస్తవానికి మీరు కూడా ఈ సందేశం వైపుకు పిలిచేవారే. అయితే, ఈ విషయాన్ని మీరు మరచిపోయి ఉన్నారు అని ఇప్పుడు కేవలం దానిని గుర్తు చేయడం జరిగింది. ఎందుకంటే వారి వారి మనోభావాలను ఏమాత్రం దెబ్బతీయకుండా, వారి ఔన్నత్యం పట్ల వారికి అవగాహన కల్పించడం.

ప్రవక్త (సఅసం) గ్రంథ ప్రజలకు లేఖలు పంపినప్పుడు వాటిలో ఈ

వాక్యాన్ని కూడా వ్రాసి పంపించారు. అయితే కస్రా పర్వేజ్ పేర లేక ప్రముఖ అవిశ్వాస నాయకులకు పంపిన లేఖలలో ఈ ఆయత్ను ప్రస్తావించలేదు. ఈ అవిశ్వాస రాజుల సిద్ధాంతాలు విగ్రహారాధనలపై స్థిరమై ఉన్నాయి. అందుకు వారికి కేవలం ఇస్లాం వైపు సందేశం మాత్రమే ఇవ్వాలి. వారు దానిని అంగీకరించిన పక్షంలో వారికి ఇహపరాల సాఫల్యపు శుభవార్తను వినిపించడం జరుగుతుంది.

అంతేకాకుండా గ్రంథ ప్రజల పాలకులకు ప్రవక్త (సఅసం) పంపిన లేఖలలో 'అస్లమ తస్లమ' తరువాత యూతికల్లాహు అజ్రక మర్రతైని (అల్లాహ్ మీకు రెట్టింపు ప్రతి ఫలాన్ని ప్రసాదిస్తాడు) కూడా ఉంది. మీరు ఇస్లాం సందేశాన్ని స్వీకరించినట్లయితే అల్లాహ్ వద్ద మీకు రెట్టింపు ప్రతిఫలం లభిస్తుందని గ్రంథ ప్రజలకు శుభవార్త వినిపించబడింది. ఈ వాక్యం 'యూతి కల్లాహు అజ్రక మర్రతైని' يُؤْتِكَ اللّٰهُ اَجْرَكَ مَرَّتَيْنِ దివ్యఖుర్ఆన్ యొక్క ఈ వాక్యపు తాత్పార్యార్థమే.

اَلَّذِيْنَ اٰتَيْنٰهُمُ الْكِتَابَ مِنْ قَبْلِهٖ هُمْ بِهٖ يُؤْمِنُوْنَ وَاِذَا يُتْلٰى عَلَيْهِمْ قَالُوْٓا اٰمَنَّا بِهٖٓ اِنَّهُ الْحَقُّ مِنْ رَّبِّنَآ اِنَّا كُنَّا مِنْ قَبْلِهٖ مُسْلِمِيْنَ اُولٰٓئِكَ يُؤْتَوْنَ اَجْرَهُمْ مَّرَّتَيْنِ۔

ఇంతకు పూర్వం మేము గ్రంథాన్ని ఇచ్చిన ప్రజలు దీనిని (ఖురాన్ను) విశ్వసిస్తారు. ఇది వారికి వినిపించబడినప్పుడు, వారు ఇలా అంటారు. 'మేము దీనిని విశ్వసించాము. ఇది నిజంగానే మా ప్రభువు తరుపు నుండి ఫలితంగా తమ ప్రతిఫలాన్ని రెండుసార్లు పొందే వారు వారే.' (అల్ఖసస్:52,54)

వారు పూర్వపు గ్రంథాన్ని స్వీకరించిన తరువాత కూడా ఖుర్ఆన్పై విశ్వాసం ఉంచడం వల్ల వీరికి రెట్టింపు ప్రతిఫలం లభిస్తుంది. వారు ఎప్పుడూ స్వమతపు పక్షపాతం చూపక దైవదాస్యం, విధేయతపై స్థిరంగా నిలిచేవారు.

మనిషి చేసే ఏ మంచికార్యమైనా, దాని విశిష్టత ప్రకారం ప్రతిఫలం

నిర్ణయించబడుతుంది. హజ్రత్ అబూమూసా అష్అరీ (రజి) ఉల్లేఖించారు.

ప్రవక్త (సఅసం) తెలిపారు: ముగ్గురు వ్యక్తులకు రెట్టింపు ప్రతిఫలం లభిస్తుంది. రెండుసార్లు విశ్వసించిన గ్రంథ ప్రజలు (మొదటిసారి తమ ప్రవక్తపై, రెండవసారి చివరి ప్రవక్త ముహమ్మద్ (స) పైన). తన యజమాని, అల్లాహ్ హక్కులను నెరవేర్చిన బానిస. తన బానిసకు విద్యాబుద్ధులు, సభ్యతా సంస్కారాలు నేర్పించి, బానిసత్వం నుండి విముక్తి పరచి ఆమెతో వివాహం చేసుకున్నవారు. (బుఖారి)

ఎదుటి వారి మనస్తత్వాన్ని దివ్యఖుర్ఆన్ వాక్యంలో చూడవచ్చు.

وَقَالُوْا كُوْنُوْا هُوْدًا اَوْ نَصٰرٰى تَهْتَدُوْا ؕ قُلْ بَلْ مِلَّةَ اِبْرٰهٖمَ حَنِيْفًا ؕ وَمَا كَانَ مِنَ الْمُشْرِكِيْنَ

"యూదులుగా మారితేనే రుజుమార్గం లభిస్తుంది" అని యూదులు అంటారు. "క్రైస్తవులుగా మారితేనే ధర్మమార్గం పొందగలుగుతారు" అని క్రైస్తవులు అంటారు. మీరు వారితో ఇలా అనండి: "కాదు, మేము అన్ని మార్గాలను విసర్జించి, ఒక్క ఇబ్రాహీమ్ మార్గాన్నే అనుసరిస్తాము. ఇబ్రాహీం ముష్రిక్కులలోని వాడుకాదు."

(అల్‌బఖర: 135)

యూదులు, క్రైస్తవుల మాటలకు సమాధానంగా, అల్లాహ్ ఒక్కడే అన్న ప్రస్తావన మాత్రం జరగలేదు. ఏకత్వవాదాన్ని హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై)తో అనుసంధానం చేస్తూ తెలుపబడింది. ఎందుకంటే యూదులు, క్రైస్తవులు ఇద్దరూ హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై)తో సంబంధం కలిగియున్నారు. ఇంకా వారిని తమ మార్గదర్శిగా భావించేవారు. మీరు హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై) ఎంతగానో ప్రేమిస్తారు గదా? మరి మీరు ఆయన గురించి ఆలోచించరా? అని ఈ ఆయత్‌లలో గుర్తు చేయడం జరిగింది. మీ పనులు, కార్యక్రమాలలో

బహుదైవారాధన చేరిపోయింది. హజ్రత్ ఇబ్రాహీమ్ (అలై) మాత్రం ఏకేశ్వరో పాసన విషయంలో అగ్రగామిగా ఉండేవారు. ఈ విషయాలన్నింటినీ కేవలం కొన్ని మాటలలో సంపూర్ణంగా తెలియజేయబడ్డాయి. ఇందులో ప్రతి విష యాన్ని విడమరిచి తెలియజేయలేదు. అయినా ఈ విషయాలన్నీ వాటికవే మన ముందుకు వస్తాయి. దీనివల్ల మాట విలువ పెరుగుతుంది. ఎదుటి వారిలో అత్యధిక మార్పు వస్తుంది.

## ఇతర గ్రంథాధారాలను ఉదహరించడం

సత్యధర్మానికి సంబంధించి ఇతర చోట రుజువులు లభిస్తే ముఖ్యంగా వారి మత గ్రంథాల్లోనే ఆధారాలుంటే- అది సందేశకులకు నిజంగానే శుభవార్త. ఎందుకంటే విశ్వాసం విషయంలో ఈ విధంగా వారి గ్రంథాల ద్వారానే వారి ఎదుటి వ్యక్తి బాధ్యత గురించి తెలియజేయడం సులభమవు తుంది. దీని ఉదాహరణ ప్రవక్త (స) గారి చరిత్ర ద్వారా తెలుసుకో వచ్చు.

బుఖారి గ్రంథంలో ఇలా ఉంది: హజ్రత్ అబ్దుల్లా (రజి) ఉల్లేఖిం చారు: ఒకసారి మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) వద్దకు తౌరాత్ గ్రంథ పండితులలో ఒకడు వచ్చి ఇలా అన్నాడు: "మేము తౌరాత్ గ్రంథాన్ని విశ్వసిస్తు న్నాము. అందులో ఇలా ఉంది- అల్లాహ్ ఆకాశాన్ని ఒకవ్రేలితో లేపుతాడు. భూమిని ఒక వ్రేలిపై, చెట్లను ఒక వ్రేలిపై, మట్టి, నీళ్ళను ఒక వ్రేలిపై ఇంకా చరాచర సృష్టిని ఒక వ్రేలిపై ఎత్తుకొని అంటాడు: "నేనే రాజును." దానికి ప్రవక్త (స) చిరునవ్వు నవ్వారు. చివరికి ఆ యూదపండితుడ్ని తృప్తిపరచారు. ఇంకా అతనిని ప్రోత్సహించడానికి ఈ వాక్యాన్ని పఠించారు. ప్రజలు అల్లాహ్ విలువను గుర్తించలేదు. ఏ విధంగా గుర్తించే హక్కు ఉందో, ప్రళయదినాన సృష్టి అంతా ఆయన గుప్పిట్లోనే ఉంటుంది. ఆకాశమంతా ఆయన హస్తంలో చిన్నవిగా చుట్టబడి ఉంటాయి. ఆయన పరిశుద్ధుడు, ఆయనకు భాగస్వాము లుగా నిలిపే వాటన్నింటితో ఆయన పవిత్రుడు.

గ్రంథ ప్రజల కొన్ని రకాల విషయాలను దివ్యఖుర్ఆన్ రుజువు

పరచడంగాని, వ్యతిరేకించడం గాని చేయకపోతే అలాంటి విషయాల పట్ల అవకాశం వచ్చేంత వరకు వేచి ఉండటమే దూరదృష్టి కాగలదు. ఒకవేళ స్వయంగా మనం ఆ విషయాలను కొట్టి వేసినట్లయితే, అవి వాస్తవాలు కావచ్చు. అలాగే వాటిని నిజపరిచినట్లయితే, అవి అవాస్తవాలు కావచ్చు. విశ్వాసి ప్రతి విషయంలో కూడా న్యాయంగా యదార్ధంపైన్నే నిలవాలి. బుఖారిలో హ్రజత్ అబూహురైరా ఉల్లేఖించారు.

హ్రజత్ అబూహురైరా (రజి) ఇలా తెలిపారు:

గ్రంథాన్ని విశ్వసించేవారు, తౌరాతు గ్రంథాన్ని హిబ్రూ భాషలో చదువుతారు. ఇస్లాంను స్వీకరించిన వారు దాని వ్యాఖ్యానాన్ని అరబీ భాషలో చదువుతారు. మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా తెలిపారు: 'మీరు గ్రంథ ప్రజలను బలపరచడం గాని, వ్యతిరేకించడం గాని చెయ్యవద్దు. అయితే, మీరు కేవలం అల్లాహ్‌ను ఆయన అవతరింపజేసిన విషయాలను విశ్వసించాము అని మాత్రమే వారితో చెప్పండి. (బుఖారి)

దీని అర్ధం ఏమిటంటే- 'మీరు ఏదయితే చెప్పుచున్నారో, అది వాస్తవంగా అల్లాహ్ తరుపు నుండి అవతరించి ఉంటే దానిపై మా విశ్వాసం ఉంది" అని తెలిపితేచాలు. అంతేగాని వారు తెలిపిన దానిని వ్యతిరేకించ వలసిన లేదా ధృవపరచవలసిన అవసరం ఏమీ లేదు. ఇలాంటి పరిస్థితులలో ముస్లిం సమాజానికి ఆయన (స) ఏ విషయాలను తెలిపే పరిజ్ఞానమైతే ఇచ్చారో, అది వారి నాగరికతతోపాటు గ్రంథ ప్రజల అనుభూతులను స్పృశించాలి. గ్రంథ ప్రజలారా! దేనినయితే మీరు తెలుపుతున్నారో, అది అల్లాహ్ తరుపు నుండి అవతరించి ఉంటే, దానిని మేము విశ్వసిస్తాము. ఇవి కేవలం మీరు కల్పించిన మాటలయితే, వాటిని మేము విశ్వసించాము" అని ఆయన (సఅసం) ముస్లిం ప్రజలు తెలుపలేదు. అయితే ఇలాంటి విషయాల పట్ల ఆయన చూపిన పద్ధతి, దాని సారాంశము అదే అవుతుంది. అదేవారి సంస్కారానికి ప్రమాణము. దీనివల్ల ఎదుటివారి మనసు గాయపడదు.

## సందేశకుని అనుభూతులు

సందేశకుని అనుభూతులను అంచనా వేయాలనుకుంటే దివ్య ఖుర్ఆన్ ఆ ఆయత్‌లను చదవండి. సమాజాన్ని సన్మార్గం వైపుకు పిలిచే విషయంలో ఆయన (సఅసం) ఎంత తపన, పడేవారో అర్థమవుతుంది. దివ్యఖుర్ఆన్‌లో ఇలా తెలుపబడింది.

**ఓ ప్రవక్తా! మీరు ఆ దిగులుతో ప్రాణం విడిచినా, వారు విశ్వసించేవారుకాదు.**

**(అష్షుఅరా:3)**

لَعَلَّكَ بَاخِعٌ نَّفْسَكَ أَلَّا يَكُونُوا مُؤْمِنِينَ

మహనీయ ముహమ్మద్ (సఅసం) ఇలా తెలిపారు:

"నాకు నా సమాజానికి మధ్యగల సంబంధం ఏమిటంటే- ఒక వ్యక్తి మంట పెట్టాడు. క్రిమికీటకాలు, మినుగురు పురుగులు అందులో పడ సాగాయి. నేనయితే మీ నడుమును పట్టి ఉన్నాను. మీరయితే అందులో పడిపోతున్నారు. (ముస్లిం)

ధర్మ ప్రచారం చేసే వ్యక్తి మనసులో సర్వమానవులను అల్లాహ్ శిక్ష నుండి రక్షించాలన్న కుతూహలం, తాపత్రయం కలగనంత వరకు ఆ వ్యక్తి సందేశవిధిని పూర్తిగా చెయ్యలేడు. దయ, జాలి స్వభావం సమాజం యొక్క అత్యున్నతమైన ఉపకార సాధకం.

ఎవరయితే ఇస్లాం ధర్మాన్ని స్వీకరించి, ధర్మం విషయంలో సందేశ కునికి సహాయకులుగా ఉంటారో, వారు అతని మనసులో ఏర్పరచు కున్న స్థానాన్ని మాటలతో చెప్పడం చాలా కష్టం. ప్రవక్త (సఅసం) ఇలాంటి విషయంలో మదీనా అన్సారులను ఉద్దేశించి ఇలా తెలిపారు:

"నేను అల్లాహ్ దాసుడను, ఆయన ప్రవక్తను. నేను అల్లాహ్ తరుపున మీ వద్దకు హిజ్రత్ చేశాను. నా జీవితమే మీ జీవితం, నా మృత్యువే మీ మరణం." (ముస్లిం)

అంటే- బ్రతకడమైనా, చావడమైనా అది మీతోనే జరగాలి. నేను మిమ్మల్ని ఎట్టి పరిస్థితులలోనూ విడిచి పెట్టలేను. ఈ సంబంధాన్ని ఒక వ్యక్తి ఇలా తెలియజేశాడు: *Behold, I do not give lectures, or Little charity but when i give, I give myself.*

## నగదు బహుమతి

ఇస్లాం సందేశ ప్రచారకుడు సందేశమివ్వడానికి వెళ్ళినప్పుడు, అతను ప్రజలకు తమ నిజగమ్య స్థానాన్ని గురించి తెలుపుతాడు. వారికి విజయ సాఫల్యాల శుభవార్త వినిపించడంతోపాటు, తన సందేశాన్ని స్వీకరించినవారికి ఏదో ఒకటి బహూకరిస్తాడు. దీనివల్ల అతనిలో పూర్తి నమ్మకం, ధృఢ విశ్వాసం కలుగుతుంది. నిమ్మళం, మనశ్శాంతి వంటి వరాలు లభిస్తాయి. వీటిని ముస్లిమేతర సోదరుల హృదయాలు ఆస్వాదించలేరు. ప్రజల అవసరాలను మనం ఎప్పుడూ త్రోసిపుచ్చలేము.

సృష్టి తేనెటీగ, గండు తుమ్మెదల వల్ల పువ్వులలో మకరందం నింపే పని తీసుకుంటుంది. అయితే దానివల్ల రంగు, వాసన కూడా వస్తాయి. అలాగే తేనె తియ్యదనం కూడా. ధర్మం వైపు వచ్చేవారికి కూడా ఏదో ఒక రూపంలో ఏదో ఒక ప్రయోజనం చేకూర్చడానికి ప్రయత్నించడం చాలా అవసరం. దీని అవసరాన్ని గుర్తించినట్లయితే, ఆ ప్రయోజనాన్ని తప్పకుండా పొందగలం.

## మనోభావాలను గౌరవించడం

మనిషి ఎప్పుడూ ఆవేశపు మార్గాన్ని ఎక్కువగా ఇష్టపడతాడు. మరో విషయం ఏమిటంటే- మనిషి జీవితం ఎక్కువగా మనోభావాల మార్గదర్శకం లోనే గడిచిపోతుంది. నిత్య జీవితంలో మనిషి తీసుకునే నిర్ణయాలు ఎక్కువగా తన మనసుకు ఇష్టమయినవిగా, తన మనోభావాల కనుగుణంగానే ఉంటాయి. ఈ ఉద్రేకం ఆలోచనాత్మకమైనది కావాలని ఇస్లాం సూచిస్తుంది.

ఆలోచన ఆచరణాత్మక భావోద్రేకంగా మారనంతవరకు దానిమీద

పూర్తి నమ్మకాన్ని ఉంచలేము. అందుకే ఒక మంచి సందేశకుడు మనిషి బుద్ధిజ్ఞానాల కంటే ఎక్కువగా భావోద్రేకాలు, మనోభావాలపైనే ఎక్కువగా దృష్టిపెడతాడు. వాస్తవానికి మనసు కిటికీలకు తెర ఉంటుంది. అయితే, హృదయ ద్వారానికి ఎలాంటి తెర ఉండదు. సందేశాన్ని హృదయ ద్వారం గుండా ఏ వ్యక్తికైనా తెలియజేయవచ్చు. అయితే, హృదయ ద్వారాలను చేరుకునే కళ, నైపుణ్యం సందేశకునికి చాలా అవసరం. తన ఉద్రేకాలు గాయపడటం ఏ వ్యక్తికీ ఇష్టముండదు. చివరికి ప్రవక్త (సఅసం) గారితో కూడా ఇలా తెలుపబడింది:

"ఓ ప్రవక్తా! మీ హృదయం కఠినమైనది గాని, క్రూరమైనది గాని అయివుంటే, వీరందరూ మీ నుండి ఎప్పుడో దూరమైపోయేవారు, అయితే అల్లాహ్ మిమ్మల్ని దయార్ద్ర హృదయంతో పుట్టించాడు. మీరు సుమెత్తని స్వభావం గలవారు.

**(ప్రవక్తా!) అల్లాహ్ యొక్క అనంత కరుణ వల్లనే నీవు వారి పట్ల మృదు స్వభావుడవు అయ్యావు. నీవే గనక కర్కశుడవు, కఠిన హృదయుడవు అయినట్లయితే వారందరూ నీచుట్టు ప్రక్కల నుండి దూరంగా పోయేవారు.**

**(ఆలి ఇమ్రాన్:159)**

فَبِمَا رَحْمَةٍ مِّنَ اللَّهِ لِنتَ
لَهُمْ ۖ وَلَوْ كُنتَ فَظًّا غَلِيظَ
الْقَلْبِ لَانفَضُّوا مِنْ
حَوْلِكَ

అంటే- మీవద్ద ఉన్నతమైన పవిత్రమైన జ్ఞానం ఉన్నప్పటికీ ప్రజలు మీముందు నిలిచేవారుకాదు. మనిషి మనోభావాలను గౌరవించనంతవరకు అతను దేనిపై కూడా స్థిరంగా నిలవలేడని దీని ద్వారా తెలుస్తుంది. ఒక వ్యక్తి తెలిపిన విషయం ఏమిటంటే- అతడు పదిహేను పదహారు సంవత్సరాలు మనిషి మనసుతో ప్రాధేయపడ్డాడు. అతనికి ఎలాంటి జవాబు లభించ లేదు. తరువాత అతను ప్రజల ఉద్రేకాలు, ఆవేశాల (హృదయాల)తో ప్రాధేయ పడ్డాడు. తరువాత కొన్ని సంవత్సరాలలోనే ఒకటిన్నర లక్షల కంటే ఎక్కువ

మంది అతనికి అనుయాయులుగా మారారు.

ధర్మంలో మనిషి భావోద్రేకాలకు, మేధస్సుకు ఎంతో ప్రాముఖ్యత ఉంది. ఆ రహస్యం ప్రవక్త (స)గారికి బాగా తెలుసు. ఒకసారి సఖీఫ్ ప్రజలు ప్రవక్త (స) దగ్గర హాజరయ్యారు. అప్పుడు ముగైరా బిన్ షోబా ప్రవక్త (స)గారితో- "సఖీఫ్ ప్రజలు మా వంశస్తులు నేను వారిని నా వద్దకు తీసుకెళ్ళి వారికి మర్యాదలు చెయ్యనా?" అని అడిగారు. ఆయన (సఅసం) ఇలా తెలిపారు: (లా అమ్నఅక ఇన్ తక్రమ ఖౌమక) మీరు మీ జాతివారికి సేవలు చెయ్యడాన్ని నేను వ్యతిరేకించను. అయితే, వారిని ఖుర్ఆన్ ఆయత్‌లు వినిపించేచోట ఉంచండి.

## సందేశకుని వ్యక్తిత్వం

సందేశ మార్గంలో సందేశకుని లక్షణాల ప్రభావం తప్పకుండా పడుతుంది. అందుకే సందేశకుడు ఎప్పుడూ ఉత్తమమైన ఉన్నత లక్షణాలు కలిగి ఉండాలి. ఎందుకంటే అది మనిషి బుద్ధిజ్ఞానాలనేకాక, అతని ఉద్వేగ ములను కూడా ప్రభావితం చేస్తుంది.

ఒకసారి మదీనా సమీపంలో ఒక బిడారు వచ్చి నిలబడింది. ప్రయాణపు బట్టలు మార్చుకొని వేరే బట్టలు ధరించి పట్టణంలోకి ప్రవేశించాలని బిడారు ప్రజలు అనుకున్నారు. ఇంతలో ఒక వ్యక్తి అక్కడికి వచ్చి తన కిష్టమైన ఒక ఎర్రని ఒంటెను కొన్ని ఖర్జూరాలకు కొని, దాన్ని తీసుకొని పట్టణంలోకి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయిన తరువాత 'అరే, మనమేం చేశాం. ఆ వ్యక్తిని మనమెవ్వరం గుర్తుపట్టలేము. ఇంకా ఆ ఒంటె మూల్యాన్ని పొందే మార్గం కూడా తెలుసుకోలేదు' అని అనుకుంటుండగా వారిలోని ఒక స్త్రీ ఇలా చెప్పింది- 'నేను ఆ వ్యక్తి ముఖారవిందాన్ని చూశాను, అది పున్నమి రాత్రి చంద్రుని వలే ఉంది. అలాంటి వ్యక్తి మోసం చెయ్యడు. ఒకవేళ ఇలాంటి వ్యక్తి దాని విలువను చెల్లించకపోతే, దానిని నేను చెల్లిస్తాను'. ఇంతలో ఒక వ్యక్తి వచ్చి నన్ను మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఒంటె

ఖరీదు ఇచ్చి పంపించారు. ఇంకా మీ ఆతిధ్యం కొరకు వేరుగా ఇంకొన్ని ఖర్జూరపు పండ్లను కూడా పంపించారు. ఒంటె ఖరీదు ఖర్జూరాలను కొలుచుకొని తీసుకోండి. ఇంకా తినండి. బిడారపు మనుషులు పట్టణంలోకి ప్రవేశించినప్పుడు ఆయన (సఅసం)ను మెంబరుపై ప్రసంగిస్తూ చూశారు.

## నేటి సమస్యలు - ఇస్లామీయ సందేశం

ఏ సమాజంలోనైనా సహజంగా కొన్ని మతపరమైన, ఆర్థిక, రాజకీయపరమైన సమస్యలు తలెత్తుతుంటాయి. ఆ సమస్యలపై దృష్టిసారించకపోవడం సమంజసం కాదు. అయితే, ఈ సమస్యల వెనుకపడి సందేశ పనిని, దాని అవసరాలను మరచిపోవడం ఎట్టి పరిస్థితిలో కూడా సరైనది కాదు. ప్రవక్త (సఅసం) మక్కాలో సందేశాన్ని ప్రారంభించినప్పుడు అక్కడి అరబ్బులలో ఎన్నో సమస్యలు ఉండేవి. అయితే, ఆయన (సఅసం) తన తొలి సందేశాన్ని ధార్మిక విశ్వాసపు సమస్యతో ప్రారంభించారు.

అంటే దైవత్వం, మనిషి యొక్క దాస్యము. ఈ రెండింటి మధ్యనున్న సంబంధపు సమస్యలు ప్రధానమైనవి. ఈ మౌలిక సమస్యలను పరిష్కరించడం వల్ల వేరే సమస్యలన్నీ వాటికవే పరిష్కరించబడతాయి. మూల సమస్యలను పరిష్కరించకుండా మిగిలిన సమస్యలపై అదుపు సాధించడం చాలా కష్టమవుతుంది. అలా చెయ్యడం అసంభవం కూడా.

జీవితంలోని అనేక సమస్యలు వేరొకరి హక్కును కాజేయడం వల్ల మాత్రమే పుట్టుకొస్తాయి. మనిషి మంచి ఆలోచనతో న్యాయమైన పద్ధతిలో జీవించినట్లయితే, అతను అత్యాచారం, దౌర్జన్యాలకు దూరంగా ఉండగలడు. దీనికోసం దైవభీతి తప్పనిసరి. అందుకే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) మొదట్లో తన సందేశాన్ని విశ్వాసంతోనే ప్రారంభించారు.

ప్రవక్త (సఅసం) అనుకొనివుంటే, తన పనిని 'అరబ్ జాతీయత్వము' పేరుతో ప్రారంభించేవారు. ఆ సమయంలో అరబ్బుల విలువైన భూములు అరబ్బుల చేతుల్లో కాకుండా, అరబ్బేతరుల ఆధీనంలో ఉండేవి. ఉత్తరాన

డెమాస్కస్ స్థలాలు రోముల ఆధీనంలో ఉండేవి. అరబ్బులు రోములకు లోబడి పరిపాలన చేసేవారు. అలాగే దక్షిణాన యమన్ స్థావరాలు ఫార్సీల హస్తగతమై ఉన్నాయి. అరబ్బులు వారి చట్టాలకు లోబడి వాటి నిర్వహణను చూసేవారు. అరబ్బుల అధీనంలో కేవలం నిస్సారమైన, విలువలేని స్థలాలు మాత్రమే ఉండేవి. ఇంకా చెప్పాలంటే అక్కడక్కడ కొన్ని పొదలు, చెట్లు తప్ప అంతా ఎడారిగానే ఉండేది.

ప్రవక్త (సఅసం) 'జాతీయత్వపు' పిలుపు ఇచ్చి అది అరబ్బులను ఆకర్షించడానికి ఎంతగానో ఉపయోగపడేది. అరబ్బులు కూడా ఆకర్షించబడే వారు. ఇంకా ఆయన (సఅసం)లో గల మార్గదర్శపు సామర్థ్యాల వల్ల తన శక్తి సామర్థ్యాలను ఎంతగానో పెంచుకునేవారు.

అదే విధంగా ఆర్థికపరమైన విషయాన్ని ప్రస్తావించవచ్చు. ఎందుకంటే అప్పటి అరబ్బులు సంపదను నిజమైన పద్ధతిలో పంచుకునే న్యాయవ్యవస్థనే ఎరుగరు. వ్యాపారమంతా కొందరి ఆధీనంలో మాత్రమే ఉండేది. వారివద్దే ధనాగారం కూడా ఉండేది. దేశ ప్రజలు ఎక్కువ శాతం దారిద్ర్యరేఖకు దిగువనే ఉండేవారు. అధికారం, సంపద గల వారికే గౌరవ మర్యాదలు, సభ్యతా సంస్కారాలు లభించేవి. ఇలాంటి సమయంలో ఈ వ్యత్యాసపు వివాదాల ద్వారా ఉద్యమం నడిపించవచ్చు. దీని ఫలితంగా అనేక మంది ఆయన (సఅసం)కు తోడుగా నిలిచేవారు.

అదే విధంగా అరబ్బులలో క్షీణించిన నీతి నిజాయితీ గురించి అందరికీ తెలుసు. సిగ్గుమాలిన తనమైతే తారాస్థాయికి చేరుకుంది. అలాంటి సమయంలో ఆయన (సఅసం) 'సంస్కరణ ఉద్యమం' పేరుతో ముందుకు వెళ్ళేవారు.

కాని, ఆయన (సఅసం) అలా చెయ్యలేదు. ఒక పనిని ప్రారంభించ డానికి అల్లాహ్ తెలిపిన పద్ధతే సరైనది కాగలదు. వాస్తవానికి ఇదే అత్యుత్తమ విధానం. అల్లాహ్‌పై విశ్వాసం ఉంచకుండా మంచి వ్యవస్థ గురించి

ఊహించనైనా ఊహించలేము. అన్ని రంగాలలో మార్పు రావలసిన అవసరం ఎంతైనా ఉంది. విశ్వాసాన్ని సంస్కరించినప్పుడే అది సాధ్యపడుతుంది. విశ్వాసాన్ని సంస్కరించే దిశలో గట్టి ప్రయత్నం చేయడం జరిగింది. ఒక వ్యవస్థను యోగ్యమైనదిగా, దానిని సఫలీకృతం చెయ్యడానికి ఒక జమాఅత్ ఉనికిలోకి రావలసిన అవసరం ఎంతైనా ఉంది.

వ్యక్తి మనసు, హృదయాలను విశ్వాసపు చట్రంలో నింపనంతవరకు అల్లకల్లోలాలు, అసభ్యకర నడవడికలు, దౌర్జన్యాలను దూరం చెయ్యలేము. దీనికోసం పెద్దపెద్ద త్యాగాలను చెయ్యగలిగే శక్తి సామర్థ్యాలు, ఉద్దేశాలు గల ఒక సమాజం కూడా ఉనికిలోకి రావలసిన అవసరం ఎంతైనా ఉంది. అనాగరిక వ్యవస్థ అది ఏ రూపంలో ఉన్నాసరే, దానిని నిజమైన వ్యవస్థగా మార్చగలిగే శక్తిసామర్థ్యాలు కావాలి. అల్లాహ్ కోసం ప్రాణాలను త్యాగం చేసే సమాజాన్ని ఉనికిలోకి తీసుకురావడానికి ఆయన (సఅసం)తన శాయశక్తులా ప్రయత్నించాడు.

మొదట విశ్వాసం వైపు సందేశమివ్వడం దానికోసం శాయశక్తులా పనిచెయ్యడం అంటే సమస్యల నుండి పూర్తిగా దూరమైపోవడం కానేకాదు. హజ్రత్ మూసా (అలై) హజ్రత్ హారూన్ (అలై) ఫిరౌన్‌కు ఏకేశ్వరోపాసన సందేశంతోపాటు బనీ ఇస్రాయీల్ ప్రజలను వేధించడం మానుకోవాలని కూడా ఫిరౌన్‌ను హెచ్చరించారు.

అంతేకాదు, విద్యనభ్యసించడానికి వారిని తమతోపాటు పంపించమన్నారు. దీనివల్ల వారి జీవితం బంగారు భవిష్యత్తు కాగలదు. దివ్య ఖుర్‌ఆన్‌లో హజ్రత్ మూసా (అలై), హజ్రత్ హారున్ (అలై)కు ఇలా తెలిపారు:

"భయపడకండి, మీతోపాటు నేనూ ఉన్నాను. అంతా వింటూవున్నాను. చూస్తూ ఉన్నాను. అతని వద్దకు వెళ్ళి ఇలా అనండి, 'మేము నీ ప్రభువు

قَالَ لَا تَخَافَا إِنَّنِي مَعَكُمَا أَسْمَعُ وَأَرَىٰ ۝ فَأْتِيَاهُ

فَقُوْلَآ اِنَّا رَسُوْلَا رَبِّكَ فَاَرْسِلْ مَعَنَا بَنِيْٓ اِسْرَآءِيْلَ ۙ وَلَا تُعَذِّبْهُمْ ؕ قَدْ جِئْنٰكَ بِاٰيَةٍ مِّنْ رَّبِّكَ ؕ وَالسَّلٰمُ عَلٰى مَنِ اتَّبَعَ

సందేశహరులం. ఇస్రాయీల్ సంతతి వారు మాతో రావడానికి అనుమతించు. వారిని బాధపెట్టకు. మేము నీవద్దకు నీ ప్రభువు సూచనలు తీసుకొని వచ్చినాము. రుజుమార్గం అనుసరించే వానికి శాంతి ఉంది.

(తాహా-46,47)

దివ్యఖుర్‌ఆన్‌లోని హజ్రత్ మూసా (అలై)గారి ప్రస్తావన ద్వారా వల్ల ఇలా తెలుస్తుంది. వారు సమాజాన్ని బహుదైవారాధన నుండి ఆపి, ఏకేశ్వర సందేశమిచ్చారు. దీని ద్వారా పరలోక సాఫల్యంతోపాటు ఇహలోక సాఫల్యాన్ని కూడా పొందగలరని తెలిపారు. దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

فَقُلْتُ اسْتَغْفِرُوْا رَبَّكُمْ ؕ اِنَّهٗ كَانَ غَفَّارًا ۙ يُّرْسِلِ السَّمَآءَ عَلَيْكُمْ مِّدْرَارًا ۙ وَّيُمْدِدْكُمْ بِاَمْوَالٍ وَّبَنِيْنَ وَيَجْعَلْ لَّكُمْ جَنّٰتٍ وَّيَجْعَلْ لَّكُمْ اَنْهٰرًا ؕ مَا لَكُمْ لَا تَرْجُوْنَ لِلّٰهِ وَقَارًا ۚ

నేను ఇలా అన్నాను: మీరు మీ ప్రభువును క్షమించమని వేడుకోండి. నిస్సందేహంగా ఆయన గొప్ప క్షమావంతుడు. ఆయన మీపై ఆకాశం నుండి పుష్కలంగా వర్షం కురిపిస్తాడు, మీకు సిరిసంపదలనూ, సంతానాన్ని ప్రసాదిస్తాడు, మీకొరకు తోటలను సృష్టిస్తాడు, మీకొరకు కాలువలను ప్రవహింపజేస్తాడు. మీకేమయింది, అల్లాహ్‌కై మీరు ఎలాంటి గౌరవాన్ని ఎందుకు ఆశించరు? (నూహ్:10-13)

ఇదే విధంగా హజ్రత్ లూత్ (అలై) తన జాతివారికి సందేశమిచ్చినప్పుడు- 'వారిలో తిష్ట వేసియున్న భయంకరమైన చెడు నుండి దూరంగా ఉండండని' ఉపదేశించారు. దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

లూత్‌ను వేము ప్రవక్తగా చేసి పంపాము. జ్ఞాపకం తెచ్చుకో. అతను తన జాతితో ఇలా అన్నాడు: 'మీరు ఇంత సిగ్గులేని వారైపోయారేమిటి? మీకు పూర్వం ప్రపంచంలో ఎవ్వడూ చెయ్యని బూతుపని చేస్తున్నారు. మీరు స్త్రీలను వదిలి పురుషులతో మీ కామాన్ని తీర్చుకుంటున్నారు? వాస్త వానికి మీరు పూర్తిగా హద్దుమీరి ప్రవర్తించేవారు." (అల్‌ఆరాఫ్:80-81)

وَلُوْطًا اِذْ قَالَ لِقَوْمِهٖٓ اَتَاْتُوْنَ
الْفَاحِشَةَ مَا سَبَقَكُمْ بِهَا
مِنْ اَحَدٍ مِّنَ الْعٰلَمِيْنَ۝
اِنَّكُمْ لَتَاْتُوْنَ الرِّجَالَ
شَهْوَةً مِّنْ دُوْنِ النِّسَآءِ۝
بَلْ اَنْتُمْ قَوْمٌ مُّسْرِفُوْنَ

హజ్రత్ షుఐబ్ (అలై) తన సమాజాన్ని ఏకేశ్వరోపాసన సందేశమిచ్చారు. ఇంకా వారి కీడు, కలహాల వైపు దృష్టిసారించి, మీరు ఈ కీడును మీ నుండి దూరం చేసుకోండి అని కోరారు.

దివ్యఖుర్‌ఆన్‌లో ఇలా ఉంది:

మేము మద్‌యను జాతి వారివద్దకు వారి సోదరుడు షుఐబ్‌ను పంపాము. అతను ఇలా అన్నాడు: "నా జాతి సోదరులారా! అల్లాహ్‌ను ఆరాధించండి. ఆయన తప్ప మీకు మరొక దేవుడు లేడు. మీ వద్దకు మీ ప్రభువు యొక్క స్పష్టమైన మార్గదర్శకత్వం వచ్చింది. కనుక తూకాన్ని, కొలతను పూర్తిగా పాటించండి. ప్రజలకు వారి వస్తువుల విషయంలో నష్టం కలిగించకండి. భూమి సంస్కరింపబడిన తరువాత,

وَاِلٰى مَدْيَنَ اَخَاهُمْ
شُعَيْبًا ط قَالَ يٰقَوْمِ اعْبُدُوا اللّٰهَ
مَا لَكُمْ مِّنْ اِلٰهٍ غَيْرُهٗ ط
قَدْ جَآءَتْكُمْ بَيِّنَةٌ
مِّنْ رَّبِّكُمْ فَاَوْفُوا الْكَيْلَ
وَالْمِيْزَانَ وَلَا تَبْخَسُوا النَّاسَ
اَشْيَآءَهُمْ وَلَا تُفْسِدُوْا

దానిలో సంక్షోభాన్ని సృష్టించకండి. ఇందులోనే మీ శ్రేయస్సు ఉంది, మీరు (నిజంగానే) విశ్వాసులైతే. ప్రజలను భయపెట్టటానికీ, విశ్వసించేవారిని అల్లాహ్ మార్గం నుండి నిరోధించడానికి, రుజుమార్గం వక్రీకరణకూ పాల్పడి (జీవితపు) ప్రతి మార్గంలో బందిపోటు దొంగలు మాదిరిగా పొంచి కూర్చోకండి. జ్ఞాపకం తెచ్చుకోండి ఆ కాలాన్ని. అప్పుడు మీరు అల్పసంఖ్యాకులుగా ఉండేవారు. తరువాత అల్లాహ్ మీ సంఖ్యను అధికం చేశాడు. కళ్ళు తెరచి చూడండి. సంక్షోభం సృష్టించిన వారి పర్యవసానం ప్రపంచంలో ఏమైయిందో!

(అల్ ఆరాఫ్:85,86)

فِى الْاَرْضِ بَعْدَ اِصْلَاحِهَا
ذٰلِكُمْ خَيْرٌ لَّكُمْ اِنْ كُنْتُمْ
مُّؤْمِنِيْنَ ۝ وَلَا تَقْعُدُوْا
بِكُلِّ صِرَاطٍ تُوْعِدُوْنَ
وَتَصُدُّوْنَ عَنْ سَبِيْلِ اللّٰهِ
مَنْ اٰمَنَ بِهٖ وَتَبْغُوْنَهَا
عِوَجًا وَاذْكُرُوْٓا اِذْ
كُنْتُمْ قَلِيْلًا فَكَثَّرَكُمْ ص
وَانْظُرُوْا كَيْفَ كَانَ عَاقِبَةُ
الْمُفْسِدِيْنَ ۔

ప్రవక్త ముహమ్మద్ (సఅసం) కేవలం ధర్మసందేశం మాత్రమే ఇవ్వలేదని ఆయన (సఅసం) సందేశ జీవితం ద్వారా తెలుస్తుంది. దివ్యఖుర్ఆన్‌లో విశ్వాసుల, అవిశ్వాసుల గుణగణాలు, నడవడికలను అంచనావేసి చూపడం జరిగింది. విశ్వాసాన్ని స్వీకరించిన వ్యక్తుల జీవితాలు ఎంతో పరిశుద్ధంగా ఉంటాయి. అలాంటి వారే సమాజాన్ని దయతో చూడగలరు. దానికి విరుద్ధంగా ఇహలోకాన్నే సర్వంగా భావించి, ప్రవక్తల సందేశాన్ని వినీవిననట్లుగా ఉండేవారు ప్రజల హక్కులను కొల్లగొడతారు. ప్రజలకు ఇలాంటివారే హానికరం.

మానవ సమస్యలను చర్చించి, వాటికి ఇస్లాం ధర్మంలో సమాధా నాలను వెతికినట్లయితే అందులో ఎలాంటి దోషమూ లేదు.

మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఖురైష్ సర్దారుల సంధి విషయమై చిన్నాయన అబూతాలిబ్‌తో ఇలా అన్నారు:

చిన్నాయన గారూ! నేను వారి ముందు ఒక వచనాన్ని తెలియజేస్తు న్నాను. వీరు దీనిని అంగీకరించినట్లేయితే అరబ్బుల అరబ్బేతరులంతా వారి విధేయులైపోతారు. ఇంకా అరబ్బేతర దేశాలు కూడా వీరికి లోబడి ఉంటాయి. అబూతాలిబ్ అదేమిటని ప్రశ్నించగా- 'లా ఇలాహ ఇల్లల్లాహ్' వచనం అని ఆయన (సఅసం) తెలిపారు.

కార్యాచరణ దృష్ట్యా ఇస్లాం సిద్ధాంతాలు తప్ప మిగిలినవన్నీ పనికి రాకుండా పోయాయి. ఈ విషయాన్ని యూరప్ పండితులు ఎందరో స్వయంగా అంగీకరించారు. Emery Reves తన పుస్తకం The Anatomy of peace లో ఇలా రాశాడు:

నేషనలిజం సిద్ధాంతాలు మానవ సమాజంలో ఒక పెద్ద కీడునే సృష్టించాయి. స్వయంగా అది నేషనలిజం లేదా ఇంటర్నేషనలిజం అయినా సరే. వీటిని పరిష్కరించడంలోనే సాఫల్యం ఉంది. వీటికి చక్కని పరిష్కార మార్గం మహోపకారి ముహమ్మద్ (సఅసం)గారి ధర్మంలోనే ఉంది.

ప్రొఫెసర్ టోయన్‌బీ తన పుస్తకం 'The World and West'లో ఇలా రాశాడు: 'ముస్లింల సోదరభావం, ఇరువురి మధ్య మత విశ్వాసం వాస్తవానికి పాశ్చాతుల స్వల్ప దృష్టిగల 'జాతీయత్వపు' సిద్ధాంతం కన్నా ఎంతో మేలయినది. ఈ సిద్ధాంతమే నేటికాలపు అవసరాలను తీర్చగలదు.

ఇంకాస్తా ముందుకెళ్ళి ఈ చరిత్రకారుడే ఇలా రాశాడు: 'యూరప్

సంస్కృతి ప్రజల కండ్లను ఎంతగా చీకటిమయం చేసిందంటే, వారు దానిని గురించి ఆలోచించకుండా కండ్లు మూసుకొని స్వీకరిస్తున్నారు. కనీసం ముస్లిం సమాజమైనా యూరప్ సంస్కృతిని విడనాడి మహోపకారి ముహమ్మద్ (సఅసం) తెలిపిన పద్ధతిపై నడవగలరని మాకు నమ్మకం ఉంది. మానవ సాఫల్యం కోసం మహనీయుని సందేశం చాలా అవసరం. అయితే, ఈ కాలంలో దీని ప్రాముఖ్యత, అవసరం మరీ ఎక్కువైపోయింది. (పేజి:30-31)

-సమాప్తం-

## CHILDREN'S LITERATURE

| | | | |
|---|---|---|---|
| 1. | Akhlaqui Kahaniyan Part I | Neetikathalu Part I | 8 |
| 2. | Akhlaqui Kahaniyan Part II | Neetikathalu Part II | 8 |
| 3. | Akhlaqui Kahaniyan Part III | Neetikathalu Part III | 10 |
| 4. | Akhlaqui Kahaniyan Part IV | Neetikathalu Part IV | 10 |
| 5. | Bachchonki Mazdoori Aur Islam | Baala Sramikulu | 10 |
| 6. | Faisale | Teerpulu | 10 |
| 7. | Badon ka Bachpan | Virisina Moggalu | 10 |
| 8. | Mothiyon ka Haar Part-I | Maniharam Part-I | 10 |
| 9. | Mothiyon ka Haar Part-II | Maniharam Part-II | 10 |
| 10. | Hamare Buzurg Part-I | Mahaneeyula Baata Part-I | 10 |
| 11. | Hamare Buzurg Part-II | Mahaneeyula Baata Part-II | 16 |
| 12. | Sachcha Deen Part-I | Islam Prabodhini Part-I | 18 |
| 13. | Sachcha Deen Part-II | Islam Prabodhini Part-II | 18 |
| 14. | Sachcha Deen Part-III | Islam Prabodhini Part-III | 25 |
| 15. | Sachcha Deen-Part-IV | Islam Prabodhini Part-IV | 30 |
| 16. | Achchi Sachi Aur Mazedaar Baatein | Madhuramyna Maastalu | 10 |
| 17. | Daana Hakeem | Daana Hakeem | 15 |
| 18. | Bache Aur Islam Balala Samvatsaram – | Islami Sandesham | 10 |
| 19. | Balabalikalaku Quran Parichayam | -Balabalikalaku Quran Parichayam | 20 |
| 20. | Balabalikalaku Islam Parichayam | - Balabalikalaku Islam Parichayam | 20 |

**TELUGU ISLAMIC PUBLICATIONS TRUST (Regd.)**
**Lakkadkot, Chatta Bazar, Hyderabad-500 002.**
**Ph.24564583, Telefax:24576237**

# ఇస్లామిక్ పోస్టల్ లైబ్రరీ

ఇస్లాం ధర్మ బోధనలను తెలుసుకొనే అద్భుత అవకాశం

## తెలుగు మరియు ఇంగ్లీషు భాషల్లో

- ఇస్లాం కోరేదేమిటి?
- మరణానంతర జీవితం గురించిన వాస్తవాలు
- మహిళల ప్రాథమిక హక్కులు
- దివ్యఖుర్ఆన్ బోధనలు
- దేవుని ఉనికికి ఆధారాలు
- తలాఖ్, ఖులా, ముస్లిం పర్సనల్ లా మొదలైన వాటి వాస్తవ సమాచారం

▶ ఇలాంటి ఇంకా అనేక అంశాలు, సమస్యలు, సందేహాలకు ఇస్లామీయ సమాధానాలు తెలుసుకోవడానికి - సంప్రదించండి.
కేవలం ఒక్క పోస్టుకార్డు వ్రాసి ఇస్లామీయ సమాచారం ఉన్న అనేక పుస్తకాలను పోస్టుద్వారా ఉచితంగా చదవండి.

▶ మీరు ఏ మతాన్ని అవలంబిస్తున్నవారైనా, మీరెలాంటి ధార్మిక విశ్వాసాన్ని కలిగివున్నా, ఏ ప్రాంతానికి చెందినవారైనా - ఈ ఉచిత సౌకర్యంతో ప్రయోజనం పొందండి.

నేడే వ్రాయండి:

**ఇస్లామిక్ ఇన్ఫర్మేషన్ సెంటర్**

సందేశభవనం, లక్కడ్‌కోట్, ఛత్తాబజార్, హైదరాబాద్-500 002.

